# TWO PLAYS



ASWATTHAMA

ACCHI



DR. C. NARAYANA RAO.
M. A., PH. D. L. T.

# రూపకద్వయి

## అశ్వత్థామ

## అచ్చి

[ఏకాంక నాటకములు.]



కర్త:

డాక్టరు చిలుకూరి నారాయణరావు
ఎమ్. ఏ., పిఎచ్. డి., ఎల్. టి.

శ్రీ 'సాధన' ముద్రణాలయము,

అనంతపురము, 1934.

ప్రథమ ముద్రణము. 1000 ప్రతులు

వెల రు. 0—12—0.

రాయలసీమ కళాశాలా

విద్యార్థులగు

సాహిత్య శిష్యులచే

3—2—1934 న

ప్రదర్శింపబడినది.

# మున్నుడి.

ఈపుస్తకములో రెండు నాటకములున్నవి. ఒకటి 'అశ్వత్థామ'; రెండోది 'అచ్చి'.

తెనుగులో విషాదాంతనాటకములు కొద్దిగా ఉన్నవి. ఉన్నవాటిలోనయినా 'విషాద' భాగము తక్కువే. అట్టి నాటకరచనలో నాటక ఏకత్వమును పాటించకపోతే కవి ఉద్దేశము నెరవేరదు. విషాదాంతనాటక మెట్లుండవలెనో నాకు తోచినపద్ధతి ప్రకారము 'అశ్వత్థామ'లో చూపినాను.

రాజులు, మంత్రులు, వీరులు, మొదలయినవారే నాటకములలో ముఖ్యపాత్రములుగా ఉండవలెననే దురభిప్రాయమును తొలగించడానికి వ్రాసినది 'అచ్చి'. చిన్నవారిలోకూడా ప్రేమ గాఢముగా ఉంటుందని నిరూపించడానికి హాస్యరసప్రధానముగా ఈనాటకమును వ్రాసినాను.

నే నింతకుముందు రచించిన 'అంబ'కును, ఈ నాటకములకును పాఠకులు భేదమును కనిపెట్టగలరు. ఈ మూడు నాటకములున్న మూడు ప్రత్యేకదృష్టులతో వ్రాయంబడినవి.

ఈ నాటకము లాంధ్రుల కాదరణపాత్రమయితే, వీటికి

ప్రత్యేక లక్షణములు గల మరికొన్ని రూపకములను వ్రాస్తాను.

నా నాటకములు చాలావరకు పూర్వలక్షణమునకు విరుద్ధముగా ఉండవచ్చును. గ్రంథములను పూర్వలక్షణము ప్రకారము వ్రాసి, ఒకటే అచ్చులో పోయడము మనము వదలుకోవలసి ఉంటుంది. నా నాటకములను విమర్శించే వారు ఇవి పూర్వలక్షణానుసారముగా ఉన్నవా లేవా అని విమర్శించి శ్రమపడ నక్కరలేదు. నాటకమును ప్రదర్శిస్తే హృద్యముగా ఉంటుందా ఉండదా, అని మాత్రము విచారించి, తమ అభిప్రాయమును తెలుప ప్రార్థిస్తున్నాను.

"ఆత్రేయాశ్రమము"

అనంతపురము. చిలుకూరి నారాయణరావు.

శ్రీముఖ మాఘ బహుళ చతుర్దశి



మిత్రులు

శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి

స. ౧౯౨ ము.

# పాత్రములు

## అశ్వత్థామ.

అశ్వత్థామ

కృపుడు

కృతవర్మ

దుర్యోధనుడు

కృష్ణుడు

## అచ్చి.

అచ్చి — కాపుపడచు, నాయిక

కిత్తయ్య — కాపుకుఱ్ఱ, నాయకుడు

ఇద్దరు పడవవాళ్లు

కూలివాళ్ళు

పోలీసులు

మేజిస్ట్రేటు, వకీళ్ళు, గుమాస్తా, మొదలయినవారు

# అ శ్వ త్థా మ

## నాం ది.

[రంగులతో త్రాటిమీద ప్రక్కకులాగే తెర. తెరవెనుక నటులు ఈ క్రిందిపాట పాడుతూ తెరవెనుకనేఉండి, మెల్లమెల్లగా నడుస్తూ ఉంటారు. శ్రీకృష్ణుడు వేణుగానముచేస్తూ, ప్రేక్షకులకు కనబడే ట్లు మెల్లగా లాగుతూఉన్న తెర అంచువెంబడిని ఒయ్యారముగా నడుచుకొంటూ పోతాడు.]

### పల్లవి

చూడగలవారే ధన్యులు - ఈ నీ రూపము, చూడ.

### అనుపల్లవి

విశ్వమోహనాకారమై - విశ్వానంతరూపమై
విశ్వసృష్టిస్థితి లయ - వృత్తి మీనిదేహము, చూడ.

### చరణములు

అనేకవక్త్రనయన ము - నేక బాహూదరము
అనేక సూర్యప్రకాశ - మనేక దీప్తాగ్ని తేజము
దివ్యానేకోద్యతాయుధమ - నాదిమధ్యాంతము
అక్షరము పరమము వేదితవ్య-మప్రమేయ మీరూపము,
చూడ.

ఇది నయనాహ్లాదకర - మిది భయంకరము
ఇది యఖిల జగత్స్వరూప - మిది లయకారణము
ఇది విశ్వవ్యాప్త మనంత - మిది లోకరక్షకము
నిజానందపరులకును - నిత్యము నిదర్శి దివ్యరూపము, చూడు.

(కృష్ణుడు నిష్క్రమిస్తాడు.)

# అశ్వత్థామ

## రంగము ౧.

[యుద్ధభూమి, విండ్లు, అమ్ములు పట్టుకొని కృప, కృతవర్మ, అశ్వత్థామలు ప్రవేశిస్తారు.]

అశ్వ: (క్రోధముతో) అపాండవము, మామా, అపాండవము!

కృప: ఏమి నాయనా, ఎన్నడున్నులేని ఈ అమంగళముమాట?

అశ్వ: అమంగళమేమిన్ని లేదు. ఒకరికి అమంగళమైనది ఇంకొ-కరికి మంగళము కావచ్చును. ...మామా, నాకు సహా-యము చేస్తావా?

కృప: దేనికి, నాయనా!

అశ్వ: దేనికయినా సరే. మొదట సహాయము చేస్తావో, లేదో, చెప్పు.

కృప: ధర్మమయితే సహాయానికేముంది!

అశ్వ: అవును...ధర్మము (చిరునవ్వుతో) ధర్మము! (కృత వర్మతో) తామూ?

కృత: కార్యమేమిటో తెలియనిదీ ఏమిచెప్పగలను!

# అశ్వత్థామ

అశ్వ: కార్యము!...ఒకరు ధర్మము, ఒకరు కార్యము!...ఒకటి అడుగుతాను చెప్పుతారా?

కృప: ఏమి నాయనా, మనస్సులో ఏదో ఆలోచిస్తున్న ట్టున్నావు? తొందరపడి ఏమిన్ని చేయకుమా.

కృత: ఏమయినా చేయగలిగినదిమాత్రే మేమున్నది?

అశ్వ: ఏమిన్ని లేదా?...ఉస్ స్ స్...

కృప: మనయత్న మేమున్నది, నాయనా? అంతా విధి విలసి-తము. వాని దయ.

అశ్వ: యత్నమే, మామా! యత్నమే! అదే జరుగలేదు. అంతా వంచన, మోసము సుమీ...విధియెవరు, మామా, మనమే కాక?

కృత: వంచన, మోసము, చేసినదెవరు? ఎవరికి చేసినారు?

అశ్వ: ఎవరేమిటి? అందరున్ను...అయ్యో, క్షమించు, ఏదో అన్నాను......మామా, మహారాజు జాడ ఏమయినా తెలిసినదా?

కృప: తెలిస్తే ఏమిలాభము? తెలియకపోతే ఏమిలాభము? ఎక్క-డో చచ్చిపోయి ఉంటాడు.

అశ్వ: అయ్యో! ఎంత పాడుమాట వినవలసివచ్చినది? మామా,

నీబుద్ధి చూపెట్టుకొన్నావు సుమా. ఇన్నాళ్లున్నూ అతని కూడుతిన్నవా డనవలసినమాట కాదిది.

కృత: నాయనా, చిన్నవాడవు, పెద్దలయెడల అట్లు అవినయము చూపకూడదు.

అశ్వ: అపరాధము, క్షమించండి...ఈ ప్రాంతములో మహా-రాజు జాడ చెప్పేవా రెవరున్నులేరా ?...మామా, చచ్చి ఉన్నా, బ్రతికిఉన్నా, నాప్రభువును, నా చెలికానిని, ఒక్కసారి కన్నులారాచూచి, అస్త్రాలు విడిచిపెట్టుతాను. అడవులుపట్టి పోతాను.

కృత: ఏమికార్యము ? అతడు చచ్చిఉంటే మనకు మరింత సుఖము. బ్రతికిఉంటే, అతనికీ మనకున్నూ కూడా దుఃఖము.

కృప: అయినదేదో అయినది. మనకేల నాయనా, పోదాము పద.

అశ్వ: అహా !...హ్హహ్హ !......(ముందుకుచూచి) అదెవరో అక్కడ పడిఉన్నారు. వానిదగ్గర కొంతమంది గొల్ల-వాళ్లు నిలిచిఉన్నారు. వారినడిగితే ఏమయినా తెలియవచ్చును. మామా, చూదామువస్తారా ?

కృత: చిరంజీవీ. నీకు పిచ్చిపట్టుతున్నది సుమా.

అశ్వ: పిచ్చే, మామా, పిచ్చే! ఈ పాపిణా లుండబట్టవు, ఏమిచేయను? కడసారిచూపు,...ఒక్కసారి. ఈ మన దేహాలలోని రక్తము, మాంసము, ఎముకలు, అన్ని అతని అన్నముమూలాన పెరిగినవేకదూ?......వాళ్లలో కొందరు ఈదారినే వస్తున్నారు. ఆ పడిఉన్న దేహరో అడిగి కనుక్కొందాము.—ఎవరక్కడ? ఇటు... ఇటు! ఎవరా స్థలములో పడిఉన్నది?—ఎవడో దిక్కుమాలినవాడు తొడలువిరిగి కొనఊపిరితో ఉన్నాడంటున్నారా? పాపము! వానిపేరు?—అడిగినాముగాని చెప్పలేకపోయినా డంటారా?—అయ్యో! ఈరీతిగా బంధువులకు మిత్రులకు దూరమయి దిక్కుమాలినచావు చచ్చేవా ళ్లీలోకములో ఎంతమంది ఉంటారో!—మామా, మన మిక్కడ చేయవలసినపని యేమిన్ని లేదు కదా. పోయి, వాని నోటిలో ఇన్ని నీళ్లయినా పోదాము, పద, పుణ్యమేకద. వాడెవడో యోధుడయి ఉంటాడు; వాని మూలముగా అయినా మహారాజు జాడ తెలుస్తుందేమో.

కృప: నాయనా, నీదిచాలా జాలిగుండెరా. ఇటువంటివా ళ్లీ యుద్ధభూమిలో ఎంతోమంది పడి ఉంటారు. వాళ్లందరికీ ఉపచారము చేయడము మనతరమా? రా,

ధృతరాష్ట్రుని వద్దకు పోదాము. అక్కడే అన్నిసంగ తులున్ను తెలుస్తాయి.

అశ్వ: అయ్యో, నామామ ఉత్తరకర్కోటకుడు. చచ్చిన వాళ్లను చూచిచూచి, ఇతని గుండె పాషాణమయి పోయినది. మనమయినా పోదాము.

కృత: పాపమీచిరంజీవి కోరిక ఎందుకు చెల్లించక పోవాలి. వాడెవడో చూచేపోదాము, పదండి.

కృప: ఊసుపోనిపని. సరే, మీయిష్టము, నడవండి.

(పోతారు.)

తెర.

## రంగము ౨.

[తొడలు విరిగి సుయోధనుడు పడియున్నాడు. దూరముగా కృప, కృతవర్మ, అశ్వత్థామలు ప్రవేశిస్తున్నారు.]

సుయో: (మూలుగుతూ) అయ్యో! దాహము! దాహము! నీళ్ళు! నీళ్లు!

అశ్వ: (చూచి) మహారాజే! మహారాజే! మామా, మహారాజే!

కృప: ఎట్లు పోల్చినావు?

అశ్వ: అదుగో, అదుగో! రా, రా! (పరుగెత్తుకొని సమీపిస్తున్నాడు.)

సుయో: (కన్నులు మూసుకొని) దాహము! దాహము!! ఎవరురా సేవకులు? ఎవరున్ను వినిపించుకోరేమి? కర్ణా! మిత్రమా?

అశ్వ: (సుయోధనుని మొగమువద్ద మొగముంచి) అన్నా! చూడు... నేను.

సుయో: తమ్ముడా, దుశ్శాసనా, వస్తివా? భీముడు చచ్చెనా? ఇంకా బ్రతికి ఉన్నాడా?...అయ్యో! దాహము!

అశ్వ: అయ్యో, తండ్రీ, మహారాజా! ఏమి నీ అవస్థ? మామా, మహారాజుకు ఒడలిమీద స్పృహలేదు. పోయి నీళ్ళు

తెస్తాను. కొంచెము ఉపచారము చేస్తూఉండు.
(పోతాడు.)

(కృపుడు సుయోధనుని తలను తనతొడమీద ఉంచుకొని కూర్చుం టాడు. కృతవర్మ చెరగుతో విసరుతూ ఉంటాడు.)

సుయో: ఎవడురా అదీ, నాతల పట్టుకొన్నదీ! భీమా! నీవేనా! బుద్ధి లేని పశువా, నీపని సరిరా!
(లేవబోయి పడిపోతాడు)

కృప: తండ్రీ, సుయోధనా, నేను...కృపుడను. కన్నువిప్పి వాకై చూడు.

సుయో: ఉహ్! (ఆయాసముతో మూలుగుతున్నాడు.)
(అశ్వత్థామ నీటితో ప్రవేశిస్తాడు)

అశ్వ: అన్నా! నోరు తెరు, ఇదిగో నీళ్ళు.

సుయో: ఉహ్! (మూలుగుతున్నాడు.)

అశ్వ: అయ్యో! అన్నా, చూడవేమి? (మొగము మీద నీళ్ళుచల్లి, కళ్ళుతుడుస్తున్నాడు.) అన్నా, నన్ను విడచి పోతావా? (ఏడుస్తాడు.)

సుయో: (కళ్ళు తెరచి చిరునవ్వుతో) ఎవరు! చిరంజీవి, అశ్వ-త్థామా! ఆ! (నోరు తెరుస్తాడు. అశ్వత్థ కొం చెము కొంచెముగా నోటిలో నీళ్ళు పోస్తాడు)

అశ్వ: తాగు, అన్నా, తాగు.

సుయో: చాలు, నాయనా, చాలు. కొంచెము తెప్పిరిల్లి కొన్నవి ప్రాణములు.—తమ్ముడూ, ఇలారా, నన్ను గట్టిగా అప్పుకో!

అశ్వ: (కౌగిలించుకొంటూ) ఏమి, అన్నా, ఇట్లా అయింది, ఏ అవస్థ?

సుయో: ఏమిచేయగలను? అధర్మమంతా పుంజీభూతమై నన్నిట్లు పడతోసింది. ధర్మమునకీలోకములో జయము కష్టసాధ్యమని నాకు తోస్తుంది.—కాని, ఇక్కడకాకపోతే, మరెక్కడయినా కలుగదా ధర్మమునకు జయము?

అశ్వ: అన్నా, తొడలువిరిగి పడిఉన్నావేమి? ఎవ డాదుర్మార్గుడు, పిరికిపంద, అధర్మముగా నడుముకు క్రిందుగా కొట్టినాడు?

సుయో: ఎవడయితే ఏమికార్యము? ఆ పేరెత్తితే పాపము వస్తుంది. ఏదో, తనమాట చెల్లిందిగదా. ధర్మమయితే ఎవరికి కావాలి? అధర్మమయితే ఎవరికి కావాలి?

అశ్వ: భీముడే? ఆ తిండిపోతే?

సుయో: భీముడే ఏమిటి? అందరున్ను కలిసినారు. కృష్ణుడు

అర్జునుని చెవిలో ఊదినాడు; అర్జునుడు తొడచరుచు-కొని సైగచేసినాడు. వాడు కొట్టినాడు.

అశ్వ: మడుగులో ఉండేవాడవు బయటికెందుకు వచ్చినావన్నా? మేము వచ్చేవరకు ఓపిక పట్టలేకపోయినావా?

దుర్యో: ఏమిచేయను? నా పౌరుషము, నా అభిమానము, నన్నూరుకోనిచ్చినవి కావు.

అశ్వ: ఏమి జరిగినది?

దుర్యో: నేను మడుగులో ఉండడము తెలుసుకొని కృష్ణుడు పాండవులతో అక్కడకు వచ్చినాడు. ధర్మరాజు కొంగు కూతలుకూస్తూ, అనరాని మాటలంటూ, నన్ను యుద్ధా-నికి పిలిచినాడు.

అశ్వ: పిలిస్తే పిలుకొన్నాడు. నీ వెందుకు బయటికి వచ్చినావన్నా!

దుర్యో: నేను రాలేను. కాని, "మగవాడవయితే, ఈవలకు వచ్చి, మాఅయిదుగురిలో ఒకన్నితో యుద్ధముచేసి గెలుచుకో. రాజ్యమంతా నీకిచ్చివేసి, మేము పోతాము" అన్నాడు ధర్మరాజు. "ప్రజలు, ఐశ్వర్యము. అంతా నాశనమయిన ఈ పాడురాజ్యము నాకెందుకు? నీతలనే కట్టుకో" అన్నాను నేను.

అశ్వ: సిగ్గు, లజ్జ, గలవాడయితే ఆ ఒక్కమాట చాలదూ, ధర్మరాజుకు?

కృత: ఎంతపని చేసినావు? నకుల సహదేవులలో ఒకనిని కోరుకోలేక పోయినావా? రాజ్యము అవలీలగా నీచేతిలో పడివుండునే!

కృప: ఇటువంటి అభిమానములకు పోయే ఆ ధర్మరాజా అట్లా అయినాడు. ఇతని కీగతి పట్టినది.

అశ్వ: ఆర్యా, మరణమయినా అయితే, నీవు చెప్పినట్లే చేసి వుండును. కాని, మన మహారాజధర్మానికొప్పుకొంటాడా? రాచపుట్టుక కాదూ?... అయితే. ఏమయిందన్నా?

సుయో: కృష్ణుడు పాండవుల నుసికొల్పి, నన్ను మాటలనిపించినాడు. నా అవస్థ తెలుసుకొని ఊరకొన్నాను. కాని, భీముడే పాదవడాని కారంభించేసరికి నా కుండబట్టింది కాదు. గదపట్టుకొని బయటికివచ్చి 'రా ర'మ్మన్నాను భీముని.

అశ్వ: అభిమానధనుడైనవా డెవడూరుకోగలడు?

సుయో: ఆ ఊపున అక్కడనే యుద్ధము జరిగివుంటే, భీముని కడతేర్చేవాడనే.

అశ్వ: అయితే అక్కడ యుద్ధము జరుగలేదూ!

సుయో: అక్కడ జరుగలేదు. "కురుక్షేత్రము పుణ్యభూమి. అక్కడ యుద్ధము చేయరుగాని రండి'' అని కృష్ణుడు పిలుమక వచ్చినాడు.

అశ్వ: నీ ఉగ్రత కొంచెము చల్లబడడానికి, భీముడు కొంచెము భయము తీర్చుకొని కుదుట బడడానికి. కృష్ణుడా, దూరవ్వ డయినానా ?

సుయో: ఇక్కడకు వచ్చేసరికి బలరాముడుకూడా ఈ దారినే వచ్చి నాడు. అతనిని మధ్యవర్తిగా కోరుకొని గదాయుద్ధ మారంభించినాను. భీము డలసిపోయిఉన్న సమయ- ములో నేనుమీదికెగిరి, తలక్రిందుగా దిగుతూ, అతని తలకు బాగా గురిచూచినాను. ఆదెబ్బ తగిలిఉంటే, వానితల వెయ్యిచెక్కలయి ఉండును.

అశ్వ: అయితే కొట్టలేదూ ? ఏమిజరిగింది ?

సుయో: నేను చెప్పలేదూ ? కృష్ణుడు గుసగుస లాడినాడు. అర్జు నుడు తొడమీద సైగచేసినాడు. అపిరికిపంద నాతొడల మీద కొట్టినాడు.

అశ్వ: తుచ్ఛుడు, దొంగదెబ్బ కొట్టినాడు. బలరాము డూర- కొన్నాడా ?

సుయో: ఏమో ! ఏమిచేసినాడో ? ఏమయిందో ? నేనుపడి

నానుగద! నేను నమ్ముకొన్న అందరున్ను అయినారు గద!

అశ్వ: కాలేదన్నా, కాలేదు! నేనున్నానుకానూ? ఈ నా మామ, కృతవర్మ, ఉన్నారుకారూ? మేమున్నంతవరకు అట్లా అధైర్యపడవద్దు.

సుయో: ఏమో! జామో! గడియో! ఈ కళ్లు మూతపడిన తరువాత ఎవరికెవరో? అంతా నిస్పృహ చేసుకొన్నాను. —కాని, తమ్ముడూ, నామనస్సులో...ఒక్క భారము మాత్రము...మిగిలి ఉందోయ్.

అశ్వ: అన్నా, చెప్పు. నీవు బ్రతికిఉండగానే నీ ఋణము తీర్చుకొంటాను.

సుయో: ఏమీలేదు, నాయనా. భీముడు...భీముడు...

అశ్వ: ఇదిగో, పోయి భీమునితలను తెచ్చి, కన్నులపండువుగా నీయెదుట పెట్టుతాను.

సుయో: వాడేమిచేసినా డనుకొన్నావు?

అశ్వ: పశువు. వాడేమయినా చేసేవాడే. ఏమి చేసినాడు?

సుయో: నేను తొడలువిరిగి నేలమీద పడిఉంటే...

అశ్వ: ఆఁ!

సుయో: ఈ నాకిరీటము...నా కిరీటము... క్రిందికిపడేటట్లు,... ఎడమకాలితో...ఎడమకాలితో ... నాతలమీద...ఈ తలమీద...

అశ్వ: అ...హ్హా! అన్నా, భరించ శక్యముకాకుండా ఉంది! మహారాజా! సాయంత్రము కావచ్చినది. అదిగో సూర్యుడ స్తమిస్తున్నాడు. తెల్లవారినదాకా కొంచెము ఓపిక పట్టి ఉండగలవా? ఎట్లయినా తట్టుకో, అన్నా! నీవు బ్రతికిఉండగా నేను నీమనస్సు సంతోషపెట్టని.

సుయో: ఏమో! నాలోపలి అవస్థచూస్తే సందేహమే. ఏమయినా సూర్యోదయము దాటేటట్లు తోచదు. ఏ...మయినా కాని. స్వర్గములోనే మనకు పునర్దర్శనము.

అశ్వ: లేదు, మహారాజా. నామాట నమ్ము. ఈలోగా మరొక్కసారి ఇక్కడనే కలుసుకొంటాము. నన్ను దీవించి పంపు.

సుయో: చిరంజీవీ! నేను లేవలేను. ఏదీ, నీచెయ్యి? ఇలా ఇయ్యి, దగ్గరగా రా. ఒక్కసారి గట్టిగా కౌగిలించుకోని... (కౌగిలించుకొంటూ) అ...హ్హా! నా ఆయాసమంతా తీరిందోయి. నాగుండె చల్లబడిందోయి!...కృతవర్మా. నా తమ్మునికి ... రణరంగ...అభిషేకము ... చేస్తాను. నీళ్లు తీసుకొనిరా. (కృతవర్మ పోతాడు.) తమ్ముడూ,

ఎందరినో నమ్ముకొన్నాను. ఎవరివల్లను అయిందికాదు.
ఆచార్యకేసరీ కిశోరమవు...నిలిచియున్నావు నా అవమా
నము తీర్చడానికి. నీవు తలచుకొంటే మూడులోకాలను
దహించేశక్తి ఉన్నది నీకు. ఈనా పరాభవానికి ఎట్లు
ప్రతీకారము చేస్తావో, నీదేభారము...ఆచార్యా, ఈ నీ
మేనల్లుడు భారత రణరంగానికి కడపటి నాయకుడవు
తున్నాడు. తామున్ను, కృతవర్మయున్ను ఇతనిని
కాపాడుకొనండి. నేను దురదృష్టవంతుడను. ఇంతకు
ముందే పంపలేకపోయినాను, ఈనా గురుపుత్రుని. (కృత
వర్మ నీళ్ళతో ప్రవేశిస్తాడు) ఇట్లాతే...ఆచార్యా! ఏవీ,
అనీళ్ళు...ఈచేతిలో పొయ్యి (కృపుడు పోస్తున్నాడు)
నాయనా, ఇవి ఉత్తనీళ్ళుకావుసుమా. నేను పనికిమా-
లినవాడనై నానన్న దుఃఖముచేత, నాఅవమానము తీర్చే
మిత్రుడింకా ఉన్నాడనే ఆనందముచేత, లోపలినుంచి
పొంగి పొరలివచ్చిన కన్నీళ్ళుసుమా ఇవి. నీవు భారత
రణరంగపట్టభద్రుడవయినావు క్షత్రియులము మేము
మా కార్యము నెరవేర్చుకోలేకపోయినాము. నా గురు
వంశములోని మొలకవు. నీవల్లనయినా నా మనస్సు
సంతోషపడితే...

అశ్వ: సందేహించకన్నా, సందేహించకు. ఇదిగో పోతు
న్నాను. నాకు సహాయమక్కరలేదు. ఏకవీరుడ ననే

పేరు సంపాదిస్తాను. కౌరవరాజ్యానికి నిన్ను అభిషిక్తుని
చేయనిదే నిద్రపోను. గట్టిగానమ్మ...మామా, చూచి
నావా, ధర్మరాజు దుర్మార్గము? తొడలు విరుగ
గొట్టించి, రక్తసిక్తమైన దేహముతో ధూళిలోపడిఉంటే,
మహారాజు, తనతో సమానుడు, అన్న గౌరవమైనా లేకుం-
డా, అన్నదమ్ములవాడన్న అంతఃకరణమైనా లేకుండా,
సాధారణ మానవులకుండవలసిన కనికరమయినా లేకుండా,
దిక్కుమాలినవానివలె విడిచిపెట్టి పోయినాడు. కొం-
చెము ఉపచారము చేయడానికి, దాహము వేస్తే రెండు
నీళ్లు నోటిలో పోయడానికయినా దగ్గర ఎవ్వరిని ఉంచ
కుండా, తనదారిని తాను పట్టుతాడా? వీడు ధర్మ
రాజా? అధర్మరాజా? పోని...ఏమి మూటకట్టు-
కొని పోతాడులే! దైవమే ఉంటే దీనికి అనుభవ
ముండదూ?...కాని, మామా, నాకుసాయమక్కరలేదు.
మీరిద్దరున్ను ఇక్కడనే ఉండి, మహారాజుకు కొంచెము
ఉపచారము చేస్తూఉండండి. నేను తిరిగి వచ్చేదాకా
మా అన్న ప్రాణాలను నిలబెట్టండి.

దుర్యో: వద్దు, అశ్వత్థామా, ఇక్కడ ఎవ్వరున్ను ఉండనక్కర
లేదు. వీరు నీకు సాయముగా ఉండాలి; నీతో తీసు
కొనిపో. నాకోసము భయపడకు. ఎట్లాగా పోయే

వాడనే. సాధ్యమయినంతమట్టుకు ప్రాణాలు ధరించు-
కొని ఉంటానులే. మీరు ముగ్గురున్ను కలసిపొండి.

అశ్వ: నీయిష్టమేకాని, అన్నా! రండి, మామా! (రెండడు-
గులు నడచి) కాళ్లురావే! (తిరిగీ సుయోధనుని దగ్గరకు
వచ్చి, మొగముమీద మొగముచేర్చి) అన్నా! ఏదీ,
మొగము! ఒక్కసారి చూడనియ్యి...ఇదే మనకు
కడసారిచూపా? (కన్నీళ్లు విడుస్తాడు.)

సుయో: తమ్ముడా! ఎంతమెత్తని గుండె నీది? (చిరునవ్వుతో
కన్నీళ్లు తుడుస్తూ) నాకోసము భయపడుతావేమిటి, నాయనా!
రా, మరొక్కసారి కౌగిలించుకో, నా మనోబలమంతా
నీకిచ్చి వేస్తాను. (కౌగిలించు కొంటాడు) ఇంక పో,
నీకార్యము చూచుకో.

కృప: ఇటువంటి వాడవేనా, కార్యభారము వహించేది? రా,
నడు.

(పోతున్నారు. తెర.)

## రంగము 3.

(అర్ధరాత్రి. యుద్ధభూమి. మఱ్ఱిచెట్టుకింద కృప కృతవర్మలు నిద్రపోతున్నారు. అశ్వత్థామ కూర్చున్నాడు.)

అశ్వ: మామా, మామా!

కృప: ఊఁ!

అశ్వ: ఇప్పు డెంతవేళ అయిఉంటుందో?

కృప: (పరుండే) ఏమినాయనా! నిద్రరాలేదూ? పడుకో. కొంచెము విశ్రాంతి తీసుకో.

అశ్వ: నిద్రరాదు, మామా! ఇది నిద్రపోవలసిన సమయమేనా?

కృప: ఈ అర్ధరాత్రివేళ ఏమిచేస్తాము? తెల్లవారని, ఆలోచించుకొందాము.

అశ్వ: తెల్లవారితే, అంతా తెల్ల వారి పోతుంది.

కృప: అయితే ఏమిచేస్తావు?

అశ్వ: అదే, నిసలహా అడుగుతున్నాను.

కృప: నాకేమీతోచలేదు. నాకు నిద్రవస్తున్నది. పడుకోని. (గుఱ్ఱు తీస్తున్నాడు)

అశ్వ: కు...క్షిం...ధ...రులు! ఎంతగట్టిగా గుఱ్ఱు పెట్టు తున్నారో!

(తెరలో నవ్వు.)

అశ్వ: (కృపుని తట్టుతూ) మామా! మామా!

కృప: అబ్బా! ఏమిటిరా, అబ్బాయీ! ఏమిటిది? నీవు పడు కోవు, ఒకరిని పడుకోనివ్వవు.

అశ్వ: కోపం పడకు, మామా! అదేమిటది? నవ్వు వినబడు తున్నది?

కృప: వాళ్లు గెలుచుకొన్నారుకాదూ? సంతోషము. నవ్వు కొంటున్నారు.

అశ్వ: ఊఁ హాఁ!...(కొంచెము ఊరకుండి) అయితే, మామా!

కృప: అ...బ్బా!

అశ్వ: కార్యము లేదు. ముసలివాడు. నాది ఉడుకురక్తము, ఊరుకోను...నవ్వులు, కేకలు! అణగిపోతవి? ఎట్లు? ఒంటరిగాడనే! సలహా చెప్పేవారుకూడా లేరే! (మళ్ళీ తెరలో నవ్వు) ఊఁ! నవ్వండి, నవ్వండి!—మామా!

కృప: (లేస్తూ) ఏమబ్బాయీ, ఏమంటావు?

అశ్వ: కాలము పరుగెత్తుతున్నదే!

కృప: ఆయితే దానిని కదలకుండా పట్టుకొంటావా?

అశ్వ: మహారాజుకు మాటయిచ్చినానే!

కృప: మాటలు చెప్పినంత సులభముగా కార్యాలయితే కావ-
లసిన దేముంది?

అశ్వ: తెల్లవారిపోతుందే!

కృప: తెల్లవారనీ. మంచిదేకదూ. చీకటిపోయి, వెలుతురు
వస్తుంది.

అశ్వ: మహారాజుమాట?

కృప: ఈలోకములో ఎల్లకాలము ఉట్టికట్టుకొని ఊగులాడేవా-
డెవడు?

అశ్వ: ఆయితే, అంతే?

కృప: ఆంతేకాకపోతే? ఒక గుఱ్ఱములేదు, ఒక మనిషిలేడు.
ముందులేదు. వెనుకలేదు. ఏమి టీవెఱ్ఱిబాగులతనము?
తెల్లవారనీ, చూచుకొందాము. నాకు చాలాబడలికగా
ఉంది. ఏమీ ఆలోచనపారలేదు. కొంచెము నిద్ర-
పోనీ. (పడుకొంటున్నాడు.)

అశ్వ: ఉహ్ !! (నిట్టూర్పువిడుస్తున్నాడు) అంతే? మహా
రాజా! నీఋణము తీర్చుకోలేనా? ఎంతవ్యర్థుడను!

ఈవిల్లు, ఈఅమ్ములు, ఎందుకు? మోతదండుగేనా? అయినదీ? కౌరవులపేరు ఈ లోకములో సరా? ...అయ్యో!...లోకమంతా నిద్రపోతున్నది. నేనొ- క్కడనే మేలుకొని ఉన్నాను. ఎంత విచిత్రమయినది, ఈలోకము? పుట్టితే, ఒక్కసారి నవ్వుతారు. జీవి అభివృద్ధిపొందుతే చూచి, ఏడ్చి, అసహ్యించుకొనే వాళ్ళే ఎక్కువమంది. వృద్ధిలో ఉన్నంతసేపు అంటి- పెట్టుకొని ఉండేవాళ్లయినా, స్వలాభ మీదే లేకరి. పడినవానివైపు చూడనైనా చూడరు; నవ్వి, మరిరెండు రాళ్ళు విసురుతారు. బ్రతికి ఉన్నవాళ్ళు చెవిటిని, చస్తే, 'అయ్యో!మరి వీనివల్ల లాభముండదే' అని ఒక్క ఏడ్పు ఏడ్చి, ఈడ్చిపారవేస్తారు. ఆతరువాత ఒకసారి తలచు- కోనయినా తలచుకోరు.—ఆపదలో సహాయపడినివాడు బంధువుడయితేనేమి? మిత్రుడయితేనేమి? వాడొక నడపీనుగు.—నాప్రభువు నెట్లు సంతోషపెట్టగలను? ఏమీ తోచదే! (ముందుకు మీదికి చూస్తున్నాడు) ఓహో, ఈచెట్టుమీద ఎన్నిపక్షులు నిద్రపోతున్నవి! నిర్విచారము! మనుష్యునిది ఒక పక్షిబ్రతుకయినా అయితే బాగుండేది. అనూ, పోరూ, లేరు. ఏమీ! వీటికి మాత్రము ప్రేమ, ద్వేషము, మిత్రత్వము, శత్రు- త్వము, ఎందుకుండవు?......ఏమది! ఆచెట్టుమీదికి

చప్పుడు చేయకుండా ఎలావస్తున్నదో, అపక్షి! ఎంత భయంకరంగా ఉంది! కన్నులవెంట నిప్పులు రాలు-స్తున్నది. ఆఁ! ఆఁ! ఆరంభించినది! ఈకలు కొరికివేస్తున్నది! ఎన్నిపక్షులో! ఓహో! నిద్ర మత్తుమీద లేచినవి. ఎంతెంతకాళ్లు! ఎంతెంతలేని గోళ్లు!! వేలకొద్దీ పక్షులు గిల గిల కొట్టుకొని క్రింద పడుతున్నవి. పారిపోతున్నవాటిని కూడా విడువ కున్నదే? వెంబడించి వెంబడించి రెక్కలతో కొట్టి కూల్చుతున్నది ...బలే! సంహారము, సంపూర్ణసంహా-రము. శత్రునిశ్శేషము! ...ఓ ఉలూకమా! నీవు నాకు గురుడవు. మంచి మిత్రమవుసుమా. మనుష్య మాత్రుడు చేయలేని ఉపదేశము చేసినావు...మామను లేపుతాను....మామా! మామా!!

కృప: ఏమి! ఏమిటి ఉపద్రవం?

అశ్వ: లే, మామా, లే! కనబడినది! కనబడినది!

కృప: (కన్నులు నులుముకొని లేస్తూ ఆవులించి) ఏమిటి, నాయ-నా, కనబడినది?

అశ్వ: శత్రు మారణోపాయము. నిద్రమత్తు వదలలేదా!

కృప: (నిద్రమత్తుతోనే) ఏమిటా ఉపాయము?

అశ్వ: అదిగో, ఆ చెట్టుమీద అదేమిటో చూచినావా?

కృప: అవును, అది గుడ్లగూబ. రాత్రి దాని సంచారము. వింతయేముంది?

అశ్వ: చెట్టుక్రింద పడిఉన్నవి అవేమిటో చూచినావా?

కృప: ఓహో, ఎన్ని పక్షులు! ఆగుడ్లగూబ వీటిని చంపి ఉంటుంది.

అశ్వ: చంపి ఉంటుందేమిటి? ఒక్క పక్షినికూడా మిగుల నివ్వలేదు. నేను చూస్తూనేఉన్నాను. మామా! అది వీటినెందుకు చంపిఉంటుందో చెప్పగలవా?

కృప: అవి తన కాహారము గనుక.

అశ్వ: ఆహారమయితే ఒక్కపక్షినిచంపితే దానిపొట్ట నిండదూ? ఇన్నిటి నొక్కసారిగా ఎందుకు చంపవలెను?

కృప: దుష్టస్వభావము, క్రూరస్వభావము. అది రాక్షసపక్షి.

అశ్వ: కాదు, మామా, కాదు. ఊరకే దాని కాక్రోశ్యము రాదు. పగ లీపక్షులు అది కన్నులు కనబడని నిస్సహాయ స్థితిలో ఉన్నప్పుడు దానిని బాధించినవి. తనకు బలమున్నా, అవి మెలకువగా ఉంటే, ఇన్నిటితో చాల లేదు. కనుక, నిద్రపోతూ, అవి నిస్సహాయస్థితిలో ఉన్నప్పుడు పగ సాధించుకొన్నది.

కృప: అయితే కావచ్చును.

అశ్వ: కావచ్చునేమిటి? అంతే! అది నాకు చక్కని ఉపదేశము చేసినదిసుమా. నీవయినా దానిపాటి అయినావు కావు. మామా! తెల్లవారేసరికి, సరి! మన మహారాజుకు శతృవనే ఒక్క పురుగుకూడా ఉండదు.

కృప: ఇదేమిరా, అబ్బాయీ! అయితే నిద్రపోతున్నవాళ్ళను చంపదలచినావా యేమిటి?

అశ్వ: తలచినావా అని ఇంకా మెల్లగా అడుగుతున్నావా? ఇదిగో పోతున్నాను. మీరిద్దరున్నూ నాతో వస్తేరండి. రాకపోతే పొండి. నాకు మీతో పనిలేదు.

కృప: నాయనా, ఇంత ఘోరమాలోచించినావేమిటి? మహావీరుడవు. అతిరథుడవు. ద్రోణునంతటివాని కొడుకవు. ఈ నీచమైనపని నీకు తగునా?

అశ్వ: ఏమి! నేను చేసేది నీచమంటావా?

కృప: నీచమా? మరీ నీచమా? ఇది యుద్ధధర్మమా? ఆయుధము లేనివానిని, పారిపోతున్న వానిని, శరణుజొచ్చిన వానిని, నిద్రపోతున్నవానిని, వీరుడయినవాడు చంపవచ్చునా? నిద్రపోయినవాడు శవముతో సమానము. అట్టివానిని వధించి పాపము సంపాదింపదలచినావా?

అశ్వ: నాకు నీతులు చెప్పుతావా, మామా? పాండవులకు చెప్పలేక పోయినావూ ఈనీతులు?

కృప: వారేమి చేసినారు?

అశ్వ: ముసలివారికి మరపెక్కువ. శిఖండిని ముందుంచుకొని అర్జునుడు భీష్ముని చంపలేదూ? భూమిలో దిగబడిన రథము నెత్తుకొంటూ, "ఉండు! నిలు!" అని చెప్పుతూ ఉన్నా కొట్టలేదూ కర్ణుని, అర్జునుడు? మాయోపాయము చేసి సైంధవుని బయటికి రప్పించి చంపించలేదూ, కృష్ణుడు? సర్వమున్ను విడిచి, మడువులో దాగున్న మహారాజును ఈవలకు పిలిచి, అధర్మముగా తొడలమీద కొట్టలేదూ, భీముడు? అస్త్రములను విడిచిపెట్టిన నా తండ్రిని అతులువ, అధృష్టద్యుమ్నుడు కరకర తల నరక లేదూ? యుద్ధధర్మము నతిక్రమించినవారు పాండవులా! కౌరవులా? మీరంతా పాండవపక్షపాతులు. ఈపక్షములోమూరి. కౌరవులను నాశనము చేయించినారు. పోండి, మీతో నాకు పనిలేదు, మీ నీతులతోనూ పని లేదు...అతగా డక్కడ ఇంకా గుఱ్ఱుపెట్టుతాడేం! (కృతవర్మను తట్టి లేపినూ) ఏమయ్యా, కృతవర్మా! ఏమిటీ మొద్దునిద్ర? ఏమిటీ గుఱ్ఱు? లేవవేం?

కృత: (ఉలికిపడిలేచి) అఁ! హాఁ!

అశ్వ: ఆఁ, హాఁ! ఏమిటి? మహారాజును నమ్మించి, నాతో వచ్చి, నీవిక్కడ చేస్తూఉన్న పనేమిటి?—లే! పద!

కృత: ఆఁ! ఎక్కడికి? ఈ అర్ధరాత్రివేళ?

అశ్వ: ఎక్కడికో? వస్తావా, రావా!—ఏమి మామా, నీమాట?

కృప: నీవుచేయబోయే దేమీబాగులేదు. విన్నావా, కృతవర్మా, అశ్వత్థామ తలపెట్టినది?

కృత: ఏమిటది?

కృప: నిద్రపోతున్న వాళ్లనందరినీ, వరుసపెట్టి, గొంతుకలు కోసి చంపేస్తాడట.

కృత: అవునా, అశ్వత్థామా!

అశ్వ: ఆ! బ్రహ్మములు తప్పించలేవు.

కృప: ఛీ! ఏమిటీ దొంగపని!

అశ్వ: నాది దొంగపనా? మీదా! తెల్లవారేసరికి మహా-రాజు ప్రాణాలు విడిచేస్తాడు. తొలికోడి కూసేసరికి, జయవార్త అతని చెవిలో వెయ్యాలి. మాట యిచ్చినాను. మీరున్నూ తలఊచి నాతో వచ్చినారు. నేను నాపని చేసేస్తాను. కృతఘ్నులు కాకపోతే, మీరున్నూ మాట నిలుపుకోండి.

కృత: నాయనా, శుద్ధమైన బ్రాహ్మణవంశములో పుట్టినావు సుమా. ఈపని నీకుతగదుసుమా.

అశ్వ: మీరు నానిశ్చయమును కదలించలేరు. ఎప్పుడు శస్త్రము పట్టినానో అప్పుడే పోయినది నా బ్రాహ్మణత్వము. ఇప్పుడు తిరిగి ఎట్లువస్తుంది? నేను చేయబోయే ఈపని వల్ల పురుగునై పుట్టినాసరే, నాకు లక్ష్యములేదు. నామహారాజును సంతోషపెట్టాలి, నేను వెనుకకు మరలాలి — ఏమి, వస్తారా, రారా?

కృప: నాయనా, నామాటవిను. ఇది మనపనికాదు. ఒకరి క్రింద సేవకులము. దుర్యోధను డేమో పడినాడు. ఇచ్చినవారితోనే లెక్క. ముసలిరాజున్నాడు, ధృతరాష్ట్రుడు; ముసలిది ఉన్నది గాంధారి. వారి వద్దనే ఉంటారు విదురుడు, సంజయుడున్ను. వారికి తెలియకేయనిదీ మనమేమిన్ని చేయకూడదు. ఉన్నస్థితి వారికి తెలిపి, వారుచెప్పినట్లు మనము చేయడము మంచిది.

అశ్వ: నాకు దానితో ఏమీపనిలేదు. మీరువస్తారా, రారా? ఏదో ఒక్కమాట చెప్పండి.

కృత: మేము రాకపోతే ఏమిచేస్తావు?

అశ్వ: ఏమిచేస్తానా? మిమ్మల్ని పిరికిపందల క్రింద లెక్క

పెడతాను. ప్రభుద్రోహులక్రింద ఎంచుతాను. విశ్వాస ఘాతుకులలో చేరుస్తాను.

కృప: నాయనా, ఒక్కమాట చెప్పుతాను, వింటావా?

అశ్వ: ఏమిటది?

కృప; ఈ రెండుజాములున్ను గడచిపోనీ. సూర్యోదయము కానీ. భాస్కరునివలె ప్రచండమూర్తివై శత్రువులను సంహరింతువుగాని. మేమున్ను నీకు సంపూర్ణముగా సహాయపడతాము. ఇది వీరు లవలంబించవలసిన పద్ధతి. ధర్మయుద్ధములో గెలుస్తే కౌరవగౌరవము నిలబడుతుంది. పాండవు లధర్మయుద్ధము చేసినారని నిందించినావే, ఈ నీ అధర్మమైన పూనికను నిందించుకోవేమి? ధర్మయుద్ధములో చస్తే, వీరస్వర్గమయినా కలుగుతుంది, అంతేకాని, ఈసాహికవధచేసి, నరకములో పడడము మేలుకాదు.

అశ్వ: ఓహో! నాకు వీరపద్ధతి నేర్పుతున్నావా? యుద్ధధర్మముపదేసున్నావా? మామా, ఆ పద్ధతులకు, ఆ ధర్మాలకు కాలము మీరిపోయింది. ఇప్పటి యుద్ధ ధర్మమును చెపుతాను విను. శత్రువులను చంపేటప్పుడు న్యాయము లేదు, అన్యాయములేదు. అప్పటికేది ఉపాయమో దాని నవలంబించవలెను. సైన్యములు లేనూఉన్నప్పుడు,

విడిసిఉన్నప్పుడు, ఇరకటపు తోవలో, నాయకుడు లేక వెనుతిరిగి పారిపోతున్నప్పుడు, నిద్రపోతున్నప్పుడు, శత్రువులమీద పడి కడతేర్చవలెను.

కృప: ఇది రాక్షసనీతిగాని, మానవనీతికాదు.

అశ్వ: యుద్ధములోని కెప్పుడు దూకినామో, అప్పుడేపట్టినది మనకు రాక్షసకళ. మనలను నమ్ముకొని మహారాజు పంపినాడు. చిన్నప్పటినుంచీ చెపతిన్నా మతని అన్నము. ఇప్పుడు కృతఘ్నులమై అతని కార్యము తీర్చకపోవడము మహాపాతకము. కృతఘ్నుని శవమును కుక్కలు, నక్కలు కూడా ముట్టవు. రాక్షసత్వము వస్తే వచ్చింది కాని, మామా, కృతఘ్నత్వ పాతకము నకు నేనొప్పుకోను.

కృప: చిరంజీవీ, నామాటవిను. కౌరవులకు దైవబలములేదు. కేవలము పౌరుషమును నమ్ముకొని సుయోధను డీసుహా-ర్యములో ప్రవేశించినాడు. పాండవులకు దైవబలము సంపూర్ణముగా ఉన్నది. వారు ధర్మాత్ములు గనుక జయించినారు.

అశ్వ: ప్రతివాడున్ను ధర్మము చెప్పవచ్చేవాడే! సుయోధను డెన్నడు అధర్మముగా ప్రవర్తించినాడో చెప్పగలవా? ఈరాజ్యము పాండవులదా? ధార్తరాష్ట్రులదా? పాండు

ధృతరాష్ట్రులలో పెద్దవా డెవడు? రాజ్యము ఔరస పుత్రులకు వస్తుందా! కుండకగోళకులకు వస్తుందా? కయ్యానికి కాలు దువ్వినవాడు ధర్మరాజా, సుయోధనుడా? యుద్ధములో ఒక్కనినైనా ధర్మముగా జయించినారూ, పాండవులు? అన్నీ తెలిసి, మళ్ళీ మాట్లాడుతున్నావు, మామా!

కృప: నాయనా, క్షత్రియ వృత్తి నవలంబించినా, మనలో బ్రాహ్మణరక్తము లేదూ? బ్రాహ్మణధర్మము, క్షత్రియ ధర్మము, కూడా అనుసరింతాము. తెల్లవారనీ, ఇప్పటికి కొంచె మోపిక పట్టు.

అశ్వ: బ్రాహ్మణుడంటే పిరికికండ, తిండిపోతు, అని నీ అభిప్రాయము. నీవు చాలా పొరబాటు పడుతున్నావు సుమా. నాకు తోచిన అర్థము చెప్పుతానువిను. బ్రాహ్మణుడు క్షత్రియులలో ఉత్తమక్షత్రియుడు. వైశ్యులలో ఉత్తమ వైశ్యుడు. ఉత్తమ శూద్రుడు శూద్రులలో. ఉత్తమచండాలుడు చండాలురలో. ఏయే వర్ణముల వారిలో ఏవేవి ఉత్తమగుణములున్నవో, వాటి నన్నిటిని చేర్చి ప్రజాపతి బ్రాహ్మణునిగా ఏర్పాటుచేసినాడు. అతడన్నివర్ణములవారికిన్ని ప్రతినిధి. జాతి, వర్ణ విభాగములలో గుణ, కర్మలు ప్రధానములు కాని, రక్తము కాదు.

కృప: నీ ఉపన్యాసము చాలా బాగున్నదిగాని, నాయనా, నామాట విను. తామసపడకు. అలసి ఉన్నాము. తెల్లవారనీ.

అశ్వ: తెల్లవారుతుంది, మామా, తెల్లవారుతుంది! తెల్లవారక నిలుస్తుందా? తూర్పు తెల్లవారేసరికి పాండవుల పని కూడా తెల్లవారించేస్తాను. తెలిసిందా? నే నెవడనో నీకు జ్ఞాపకమున్నదా? ద్రోణాచార్యుని కొడుకను; ఆ ధృష్టద్యుమ్నుడు తలకోసిన ద్రోణాచార్యుని కొడుకను. సుయోధనుని సేవకుడను; అన్యాయముగా, అధర్మముగా అచ్చట తొడలు విరిగి పడిఉండి, నన్ను కౌగిలించుకొని, "నా పగదీర్చుమీ" అని కన్నీళ్ళతో దీనముగా నా మొగము చూచి, నన్ను రణరంగాభిషిక్తునిచేసిన రాజరాజు సేవకుడను. మీరు నానాయకత్వమున నన్ననుసరించవలసిన నా అనుచరులు. ఇదిగో, ఆజ్ఞాపిస్తున్నాను. రండి! నడవండి!

కృప: కృతవర్మా, అశ్వత్థామపూన్కిని మరల్చలేము. కాని, అన్నిటికిన్ని ఒప్పుకొనే ఇందులోనికి దిగబడ్డాము. ఏమంటావు? ఇతనితో పోదామా?

కృత: పోక ఎట్లాతీరుతుంది? చస్తే చస్తాము; బ్రతుకుతే బ్రతుకుతాము. బ్రతికి ఉండి మాత్రం మెక్కడకు పోగలము? కావలసినదేదో కాక తీరుతుందా?

అశ్వ: ఏమి, చూస్తూనిలబడతారేమి ? రండి ! నడవండి !!

కృప: పద, నాయనా, వస్తున్నాము, పద.

(పోతున్నాడు. తెర.)

## రంగము ౪.

[పాండవుల శిబిరద్వారము ముందు అశ్వత్థామ ప్రవేశిస్తున్నాడు.]

అశ్వ: మామామ నాప్రక్క నిలబెట్టినాను. కృతవర్మ నీప్రక్క నిలబెట్టినాను. ఒక్క పురుగుకూడా తప్పించుకొని పోలేదు...ఇదిగో, శిబిర ముఖద్వారము...... ఎంతధైర్యము! ఎంత నిర్లక్ష్యము! ద్వారము తెరిచే ఉంచినారు. నాపని సులభముచేసినారు......ఏమిరా, గెలిచినా మనుకొంటున్నారా? కేకలు, నవ్వులు, తుళ్లిపాటు!— తీరుస్తా నుండండి. ఏడు బ్రతికి ఉన్నాడని మరచినారో! ఎక్కడో కొండలు, అడవులు పట్టిపోయినా డనుకొన్నారో! ... ఇదిగో ప్రవేశిస్తున్నాను......జయ, కాలరుద్రా, జయ! జయ, ప్రళయమూర్తీ, జయ!...(ముందుకు ఉరికి, వెనుకకు తగ్గి) ఏమిది, ఈ ఆకారము! రక్తమయమైన పులితోలు కట్టుకొన్నది! బుస్సుమని కరువవచ్చే విషసర్పములను జందెములుగా వేసుకొన్నది! నోరు తెరచుకొని లోకమంతటిని మింగవచ్చిన ట్లున్నదే! ఎన్నికన్నులు, జిగజిగ మెరసిపోతున్నవి! ఓహో! ఎంత భయంకరముగా ఉన్నది! దీనిని చూస్తే కొండకూడా పెకిల్లిన

బిడ్డలు కావలసినదే. ఏ మామంటలు! నోరు, ముక్కు, కన్నులు, అన్నిటినుంచి బయలుదేరి, నాలుకలతో లోకమును నాకివేసేటట్లున్నవే, ...నా పూనికకిది ఒకపరీక్ష. కాని...ఓ భూతమా. నీవెవరు? నాకెందు కడ్డుగా వచ్చినావు? పో, తొలగిపో! నాకు దారి ఇచ్చివెయ్యి!...ఏమి, మీఁదికివస్తావా? వీడెవడో నీకు తెలుసునా! నీవు కాదు, నీవంటి వెయ్యిమంది వచ్చినా నాకు భయములేదు. నీవు పాండవులను రక్షించడానికి నాకడ్డు పడ్డావా! ఇతరము కాదు. తెల్లవారేసరికి అయితీరాలి; నా మహారాజు సంతోషించాలి...ఏమి! పోవా! అయితే కాచుకో! (బాణములు వదలుతున్నాడు.) ఎంత ఆశ్చర్యము! ఈ నా ఘోరాస్త్రములను మ్రింగివేస్తున్నదే!...ఓహో! మ్రింగు, చూదాము, ఈశక్తిని (శక్తిని వదలుతున్నాడు) ...అఁ! ఆఁ! సూర్యునిలో తోకచుక్కవలె చిన్న చిన్న తునకలై, ఆనోటిలో లీనమై పోయినదే! ...... హుమ్! కాని, ఇక దీనిని తప్పించుకోలేవు, నీపని సరి. (ఖడ్గమును విసరుతున్నాడు.) ... ఏమిది! పళ్లిగిలించి నవ్వుతున్నది! ఎంత భయంకరమైన నవ్వు! దూది తగిలినట్లయినా కాలేదేమో. ఇంక ఊరుకోకూడదు. కాచుకో (తోమరములను చక్రములను వదలుతున్నాడు)

... ఇంకా నవ్వేనా? అన్నిటినీ కబళించి వేసు-
న్నావా? ...దీనితో నీ పని కడతేరుతుంది. హుమ్!
తొలగిపో, లేకపోతే చస్తావు...ఏమిది? కదలవు!...
సరే, విసరుమంటావా? కానీ...ఉష్! (గద విసరు
తున్నాడు.) అయ్యో, తిమింగిలము చిరుచేపను మ్రింగి-
వేసినట్లు మ్రింగివేసినదే! నావద్దనున్న ఆయుధములన్ని
అయినవి, ఇక నేమిచేయగలను? ...ఓహో! ఇది
యేమి, ఈ క్రొత్త విచిత్రము! ఎంతమందో, ఆకా-
శముమీద! ఎందరు విష్ణుమూర్తులో! ఎంత భయం-
కరంగా ఉన్నారు! ...ఇది ఘోరమైన పరీక్ష. కానీ.
ఈ విష్ణుమాయకు అశ్వత్థామ లోబడుతాడా? అది
ఎన్నటికిన్ని కుదరదు. విష్ణువు పాండవపక్షపాతి.
నాయిష్టదైవము ముందర ఈతడేపాటి? హర, హర,
మహాదేవ, శంభో! శ్రీకంఠా, ఉగ్రా, రుద్రా,
శూలధరా! ఇదిగో నీభక్తుడు పిలుస్తున్నాడు. నీసం-
హారరూపముతో సాక్షాత్కరించు. ఏదీ, నీప్రళయ
తాండవము? జగమంతా నీనృత్యమునకు స్మశాన
వాటికగా చేసేస్తాను. రా, నృత్యము చెయ్యి. నేను
పాటలు పాడుతాను. విష్ణువు వేణుగానముచేస్తాడు.
ప్రమథగణాలు ఆనందముతో నీతోకూడా నాట్యము
చేస్తారు. ఏమి, రావా, నాకు సాక్షాత్కారమివ్వవా!

అయితే, ఇదిగో, నన్నే తీసుకో నీలోనికి (హర్యాని ధ్యానము చేస్తున్నాడు.)

(కృప, కృతవర్మలు ప్రవేశిస్తున్నారు.)

కృత: అశ్వత్థామ లోపలికి ప్రవేశించి ఉంటాడా?

కృప: ప్రవేశించిఉంటాడు. మనకు పని కలుగకుండా తానే కడతేర్చి ఉంటాడు ... లేదు, ఇదిగో, ఇక్కడనే ఉన్నాడు. ఏదో ధ్యానములో ఉన్నాడు.

కృత: ఏదో, ఘోరమైన ఉద్యోగమే.

అశ్వ: ఏమి? అగ్ని ప్రజ్వరిల్లదేమి? ఉష్మా! వెలుగు! (తెరలో మంట) భేష్, వెలిగినది! భవా, అభవా, రుద్రా, భక్త ప్రియా! తీసుకో, ఇదిగో, ఆత్మోపహారము.

(నిష్క్రమిస్తున్నాడు)

కృత: ఆదేమిటది? ఓహో! వేదికమీద, భగభగ మండిపోతూ ఉన్న అగ్నిజ్వాలలమధ్య నవ్వుతూ నిలబడిఉన్నాడు! ఆచార్యా, నాకు భయమువేస్తున్నది. నన్ను పట్టుకో. తల గిఱ్ఱున తిరిగిపోతున్నది.

కృత: నాకు తల, భూమి, కూడా తిరిగిపోతున్నవి. కన్నులు చీకట్లు క్రమ్మిపోతున్నవి. కాళ్ళు గడగడ వడకిపో-

తున్నవి ఏదీ, ఎక్కడ ఉన్నావు, కృతవర్మా! రా,
ఒకరినొకరము పట్టుకొందాము.

కృత: చూడు, చూడు, అశ్వత్థామ మారిపోతున్నాడు. ఏమి ఆ తేజస్సు! రుద్రతేజస్సువలె ఉన్నదే. కళ్ళు మిరుమిట్లు పోతూఉన్నవి...అదిగో వస్తున్నాడు. ప్రక్కకు తప్పుకొందాము రా. ఆ ఆవేశములో అతనికి మనమే ప్రథమ కబళమవుతామేమో!

(అశ్వత్థామ ఒకఖడ్గముతో ప్రవేశిస్తున్నాడు.)

అశ్వ: అయినది! అయినది! సరి! సరి! ...మామా! మామా! ...కృతవర్మా! కృతవర్మా! ...ఆఁ! ఇక్కడలేరు, మరచినాను, అక్కడ కాపుంచినాను. పోయి జాగ్రత్త చెప్పివస్తాను. (ముందుకు పోతున్నాడు)

కృప: (వెనుకనుండి మెల్లగా) చిరంజీవీ, అశ్వత్థామా!

అశ్వ: (వెనుకకు తిరిగి) ఎవరది? నన్ను పిలిచినది?

కృప: నేను, నీమామను.

అశ్వ: మామా, కృతవర్మా! ఇక్కడనే ఉన్నారా? ఏమి చేస్తున్నారిక్కడ? మిమ్మలి నెక్కడ ఉండమన్నాను? మీ రెక్కడనున్నారు?

కృప: నీవు చాలాసేపటివరకు రాకపోతే, మాకు పనిలేకుండా నీవే కడతేర్చవనుకొని, వచ్చేశాము.

అశ్వ: లేదు, మామా, ఇంకా ఆరంభము కాలేదు. ఇదిగో అవుతుంది.

కృప: నాయనా, అఖడ్గమెక్కడిదోయ్? అంత భయంకరముగా ఉంది?

అశ్వ: ఇది కాలఖడ్గము! రుద్రఖడ్గము! శత్రుసంహారఖడ్గము. నేను సంపాదించుకొన్నాను: భవానీప్రియుడు నాకు స్వయముగా తనచేతితో ఇచ్చినాడు. చూచినారా? దీనికి తిరుగులేదు. (పళ్ళు బిగిస్తూ) కరా! కరా! ఒక్కని కూడా మిగలనివ్వను. మీరు పోండి నేను చెప్పిన దగ్గర నిలుచోండి. ఎవరు వచ్చినాసరే, విన్నారా? ఎంత పనికిమాలినవాడయినా సరే—తెలిసిందా? ఎంత కాళ్ళమీదపడినా సరే, వదలకూడదు. దయ, దాక్షిణ్యము లేకుండా, పరా! పరా! నరకి పారవేయవలసినదే. ఇది శివాజ్ఞ; తప్పినారో, మీ ప్రాణాలు మీవి కావు. పోండి, పోండి. నేనిదిగో ప్రవేశిస్తున్నాను. జయ! జయ! హర, హర, శంకర, మహాదేవ!

(పోతున్నారు, తెర.)

## రంగము ౯.

[అశ్వత్థామ రక్తముతో తడిసిన అంగీతో నృత్యముచేస్తూ ప్రవేశిస్తు-న్నాడు. చేతిలో ఖడ్గము. కృప, కృతవర్మలు ప్రక్కను నిలుచున్నారు. కృష్ణుడు ముందుకు నిలిచి వేణు వూదుతున్నాడు]

అశ్వత్థామ.

ఈశ గిరీశ నరేశ పరేశ మ
హేశ బిలేశయభూషణ భో!
సాంబ సదాశివ శంభో శంకర
శరణం మే తవ చరణ యుగమ్.

జయ కైలాసనివాస ప్రమథగ-
ణాధీశ భూసురార్చిత భో!
సాంబ సదాశివ శంభో శంకర
శరణం మే తవ చరణయుగమ్,

ఝుణుతక ఝుంతిణి ఝుణుత కిటతక
శబ్దైర్నటని మహానట భో!
సాంబ సదాశివ శంభో శంకర
శరణం మే తవ చరణయుగమ్!

(నాట్యము చేస్తూ నిష్క్రమిస్తాడు.)

కృత: అయిపోతున్నది, ఆచార్యా, అయిపోతున్నది.

కృప: ఆ! చాలామట్టుకయి ఉంటుంది.

కృత: చూచినావా, అరూపము! అతి ఘోరముగా ఉన్నది.
చూడ శక్యము కాకున్నది.

(అశ్వత్థామ నాట్యముచేస్తూ ప్రవేశము.)

అశ్వత్థామ.

హరం త్రిపురభంజన మనంతకృతకంకణ-
మఖండదయ మంతరహితమ్
విరించి సురసంహతి పురందర విచింతిత-
పదం తరుణచంద్ర మకుటమ్
పరం పదవిఖండితయమం భసితమండిత-
తనుం మదనవంచన పరమ్
చిరంతన మిమం ప్రణతసంచితనిధిం పరచి-
దంబరనటం హృది భజే.
అనంగపరిపంథిన మజం క్షితిధురంధరమ-
లం కరుణయంత మఖిలమ్
జ్వలంత మనలం దధత మంతకరిపుం సతత-
మింద్ర సురవందితపదమ్

ఉపంచ దరవిందకులబంధు శతబింబ రుచి-
సంహతి సుగంధి వపుషమ్
పతంజలినుతం ప్రణవపంజరశుకం పరచి-
దంబరనటం హృదిభజే. (నిష్క్రమిస్తాడు.)

కృత: ఓహో! ఏమి, ఈ కాలరూపము!

కృప: కృతవర్మా, రుద్రుడు వానిలో ఆవేశించి ఉన్నాడు. వానినడ్డుకొనడానికి బ్రహ్మాదులకుకూడా సాధ్యముకాదు.

కృత: అదిగో, ధృష్టద్యుమ్నుని శిబిరములోనికి దుమికినాడు.

కృప: అయినది, వానిపని. అదిగో, తలలువీడి పారిపోతున్నారు. వీరిని మనము వదలకూడదు. వదలితే, మనలనుకూడా కడతేర్చివేస్తారు. ఆవేశముమీద ఒళ్లూపై తెలియును. జాగ్రత్తగా కాచుకో.

(అశ్వత్థామ ధృష్టద్యుమ్నుని శవము ఈడ్చుకొని ప్రవేశిస్తున్నాడు.)

అశ్వ: హిహిహీహీ! ఏమిరా, ధృష్టద్యుమ్నా! అయినదా, నీపొగరు? అస్త్రసన్యాసము చేసిన నాతండ్రితల కోస్తావా! పశువా, (కాలితో తంతున్నాడు.) అట్లా చేయకూడదని నీతో చెప్పేవారే లేకపోయినారా, అక్కడ? పశువులు. వాళ్ళేరి? ఇప్పుడెక్కడ దాగున్నారురా ఆ పాండవులు. పద, నిన్ను చూపెట్టి, వాళ్ళనుకూడా సంహరము చేసేస్తాను! పద (పాడుతూ నాట్యంచేస్తూ)

అతిభీషణ కటుభాషణ యమకింకర పటలీ
కృతతాడన పరిపీడన మరణాగమ సమయే
ఉమయా సహ మమచేతసి యమశాసన నివసన్
శివ శంకర శివ శంకర హర మే హర దురితమ్.

త్రిపురాంతక త్రిదశేశ్వర గణనాయక శివ తే
శరణం భవ కృతసాగర ఫణికంకణ చరణమ్
వృషవాహన విషదూషణ పతితోద్ధర శరణమ్
శివ శంకర శివ శంకర హర మే హర దురితమ్.

(పోతున్నాడు.)

కృత: ఈ ఆవేశములో పాండవు లెదురుపడితే అయిందన్న మాటే వారిపని.

కృప: పాండవు లెక్కడెక్కడా లేరులే.

కృత: బ్రతికిపోయినారు. ఎక్కడకుపోయినారు ?

కృప: కృష్ణుడు వారినెక్కడకో దూరముగా తీసుకొనిపోయి-నాడు. శరణాగతవత్సలుడు. అతడు తనభక్తుల కపాయము రానివ్వడు.

కృత: కౌరవులందరున్ను కడతేరినారు. పోని, వారయినా బ్రతుకని....అదిగో, వస్తున్నాడు. చేతిలో ఒక తల పట్టుకొని ఉన్నాడు. ఏమి, ఆచార్యా, అది భీముని తల వలె ఉన్నది !

కృప: అది భీముని తలకాయ. ఊరుకో, అతి ఉగ్రమూర్తిగా ఉన్నాడు.

(అశ్వత్థామ ఒకతల పట్టుకొని నాట్యముచేస్తున్నాడు.)

అశ్వత్థామ.

అఖర్వ గర్వ దుర్విజృంభ కుంభి దంభదానవం
జటేన తర్జన త్రిశూలచాలనే విహారిణే
సుదృ క్సుదృ క్సహస్ర చ్ఛయాపహారిణే విదారిణే
నమ శ్శివాయ సాంబశంకరాయ చంద్రమౌళయే.

శివాయ దివ్యవైభవాయ నాయనాగ్ని హృష్టహృ
ద్భవాయ భూమభృద్ధనుర్ధరాయ విశ్వవర్ధనే
సమృద్ధి బుద్ధమర్ధను ప్రవృద్ధ వందితాయతే
నమ శ్శివాయ సాంబ శంకరాయ చంద్రమౌళయే.

అఖండితాండ బాహుదండ దండితోగ్ర డిండిమి
ప్రడిండ్ఢిమి ఢ్ఢిమి ధ్వని ప్రమోదితోగ్ర తాండవమ్
విధాయినే ధనాధినాథ సాఖ్యసఖ్యదాయినే
నమ శ్శివాయ సాంబ శంకరాయ చంద్రమౌళయే.

జయ. హర, హర. మహాదేవ, శంభో, శంకర!...అయినది! అయినది! లయము! ప్రలయము! లయములోనే ఉంది సృష్టి; సృష్టిలోనే ఇమిడిఉంది లయము! ఈమధ్య నున్నదంతా భగవల్లీల! ఆ లయలీలలో నే నొక సాధనము; ఈశ్వరప్రీతి సంపాదించు

కొన్న సాధనము నేను. ఇది అన్నదమ్ముల పోరాటము! సర్వనాశనము! ఈ భరతఖండ మొక రుద్రభూమి అయింది! భారత సంగ్రామము ముగిసింది! బ్రహ్మకు తిరిగీ పనికలిగింది. సృష్టించుకోని, క్రొత్త సృష్టి! ఈ సంగ్రామాగ్ని శేషముతో నూతన జ్యోతిని వెలిగించని! ఈలోగా ఈ స్మశానవాటికలో ఆడుకోండి! భూత, ప్రేత పిశాచములారా, రండి! శాకిని, ఢాకిని, గణములారా! తొక్కండి, చిందులు తొక్కండి! భృంగిరిటీ, మద్దెల వాయించు. తుంబురునారదులారా! వీణ శ్రుతిచేసుకొని పాడండి! ఇదిగో శివతాండవము!!

ధిం ధిం తక తక — ధిం ధిం తక తక — ధిం.
ధిం తకతక — ధిం తకతక — ధిం తకతక — ధిం.
ధింకిటతకధిం — ధింకిటతకధిం — ధింకిటతక ధిం — ధిం.
ఝుణుతక ఝుంతిణి ఝుణుత క్కిటతక ధింధింతకతక - ధిం.

(నృత్యము చేసుకొంటూ నిష్క్రమిస్తాడు.)

కృప: కృతవర్మా, ఇప్పు డశ్వత్థామను మాట్లాడించి లాభము లేదు. కొంతసేపటికి స్థిమితపడుతాడు. అప్పటివరకు ఆతనికి చేరువగా పోకూడదు. దూరమునుంచే అనుసరింతాము, పద.

(పోతారు. తెర.)

## రంగము ౬.

[యుద్ధభూమి. సుయోధనుడు పడియున్నాడు. కృప, కృతవర్మ, అశ్వత్థామలు ప్రవేశిస్తారు. అశ్వత్థామ ఎడమచేతిలో ఒక తల, కుడిచేతిలో కత్తి.]

అశ్వ: అదుగో, అరుణోదయ మవుతున్నది, మామా! నడు, వేగముగ నడు! (సుయోధనుని సమీపిస్తాడు. అతనిమీద వంగి) మహారాజా! ఇదిగో! నేను. అశ్వత్థామను. చూడు! నీఋణము తీర్చుకొన్నాను సుమా.

సుయో: (లోకువగుకతో) ఆ! తమ్ముడూ!...వచ్చినావా?... ఏ...దీ,...భీ...ము...ని తల?

అశ్వ: ఇదిగో చూడు. (తలను చూపిస్తున్నాడు.)

సుయో: ఆఁ!...బా...గుం...ది!...(చిరునవ్వుతో) న...వ్వ ....డేం?....ఏ....వ....రు....రా. శాశ్వతము? భీ...మా?

అశ్వ: అన్నా! సంతోషమయిందా?

సుయో: ఆఁ! ఇ...గో, అం...తా...

అశ్వ: ఆ! అయింది. ఒక్క పురుగునుకూడా మిగల్చలేదు.

కృప: (సుయోధనుని నాడి పట్టిచూచి) అశ్వత్థామా. ఈతని పని కూడా అయింది. చూచినావా, నిలువుగుడ్లు పడినవి.

సుయో: త...మ్మ...ఊం! (కౌగిలించుకోనిమ్మని చేతులెత్త బోతున్నాడు. అశ్వత్థామకూడా కౌగిలించు కొనడానికి దగ్గరగా చేరుతున్నాడు. కృపు డశ్వత్థామను ఎడముగా లాగేస్తున్నాడు.)

కృప: వద్దు, చిరంజీవీ! తుదిపట్టు, అది. తరువాత విడిపించు కొనడము కష్టము. బ్రతికి ఉండి, నిన్ను పట్టి పంతము సాధించుకొన్నాడు. కన్నులు మూస్తూకూడా నిన్ను తన పట్టులో ఇరికించుకొంటాడు.

అశ్వ: (మొగముమీద మొగముంచి) సరా!...అన్నా! ఈ తలను కసితీరా ఒకసారి తన్నుకోవూ?

కృప: రావోయ్, పిచ్చివాడా! తంతాడో, తన్నుకొంటాడో! నీకు నిజముగా మతిపోయినది. (నవ్వుతూ) ఈ తల భీముని దనుకొన్నావేమో. అది వాయతల, మట్టితల, పాండవులను చంపినాననే అనుకొంటున్నావు కాబోలు. వాళ్లు నీకు చిక్కేవాళ్ళే? కృష్ణుని పాపిపులో సురక్షితముగా ఉన్నారు.

అశ్వ: అం! హాం! నిజమే?...నిజమే? ఇది భీముని

తలకాయా? (చూస్తున్నాడు) ఛీ, కాదు. (పారవేస్తున్నాడు) అప్పుడెందుకు చెప్పినావు కావు?...ద్రోహము! ద్రోహము!...పాండవులను నేనయి బ్రతికి ఉంచినిర్వాను. ఇదిగో జగద్ధ్వంసకాస్త్రము. బ్రహ్మశిరము, వదిలేస్తున్నాను.

కృప: ఆఁ! ఆఁ! వద్దు, నాయనా, వద్దు! వదల వద్దు!

అశ్వ: నీవు నాకడ్డురాకు, మామా, అడ్డురాకు. ఇదిగో వదలేశాను.

అపాండవము; మామా, అపాండవము.

(తెర.)

# అచ్చి

లేక

# కాపువలపు

[ కన్నయ్య కాపుకుఱ్ఱ. తోటలో కూర్చున్నాడు.
అచ్చి కాపుపడుచు దగ్గర పొలములో కలుపుతీస్తున్నది. ]

(పాడుతున్నది.)—

చందమామా — నీ

అందమైన — మోమేది — చందమామ — యీ

కందేల — వచ్చెనోయి — చందమామ — ఆ

కుందేటి — దాకేల — చందమామ — నీ

కెంమకిట్లా — తిరుగుతావు — చందమామ — యీ

కుండేల — నోయినీకు — చందమామ — నువ్వు

సందడేల — పడతావు — చందమామ — ఆ

సందెరయేళ — వొస్తార — చందమామ — నా

ముందట నిల — బడతావ — చందమామ — మన

మందరము — బువ్వతిందాం — చందమామ — నువ్వు

మచ్చుకొ - క్క - పాట - తుమ్మెద - నే
మెచ్చు కొం - టాగదే - తుమ్మెద.

అచ్చంగ - నామీద - తుమ్మెద - మన
సొచ్చి వు - న్నాదటే - తుమ్మెద.

అచ్చమై - నతేనె - తుమ్మెద - నే
నిచ్చు కొం - టానులే - తుమ్మెద.

పచ్చని - చీరలే - తుమ్మెద - నే
తెచ్చియి - స్తానులే - తుమ్మెద.

విచ్చి వు - న్నపూలు - తుమ్మెద - నీ
కిచ్చు కొం - టానులే - తుమ్మెద.

వచ్చి చూ - డకపోతె - తుమ్మెద - మనసు
చిచ్చున - పెడతావు - తుమ్మెద.

ఎచ్చట - వున్నావె - తుమ్మెద - నాప
పిచ్చిపడు - తున్నాది - తుమ్మెద.

పెచ్చుపెరి - గిపోతె - తుమ్మెద - కలను
అచ్చి వొ - స్తుందిసుమి - తుమ్మెద.

అచ్చి: ఏంటే, పిల్లాడా, నీవాడ పాడుతున్నదీ!

కిష్ట: నువ్వు పాడుతున్నదేంటే, పిల్లా?

అచ్చి: నాను సంవసూముపాట పాడుకొంటున్నా.

కిష్ట: నాను ఉమ్మెదపాట పాడుకొంటున్నా.

అచ్చి: నీ కుండబట్ట దేంటి? నా పేరెందు కత్తుత్తావు?

కిష్ట: నీ కుంపబట్ట దేంటి? నన్నెందుకు పిలుత్తావు?

అచ్చి: ని నోస్నేరు పిలిసినారురా, నాను పాడుకొంటా వుండే?

కిష్ట: ని నోస్నేరు పిలిసినారే, నా ఉమ్మెదని పిలుసుకొంటా వుండే?

అచ్చి: మా వోళ్లతో సెప్తా నూడు.

కిష్ట: సెప్పకో! ఆ క్లెమిసేత్తారులే.

అచ్చి: నీ తో లాలిసేస్తారు.

కిష్ట: వాలుసుకోనిలే. వాలుత్తే అక్లకే మచ్చొచ్చత్తదా?

అచ్చి: అవ్వేడకు పోతాది? యీడనే వుంటాది. తిత్తోలుత్తే కిత్తర్యోడకు పోతాడో!

కిష్ట: యాడకుపోతాడు? అచ్చికాడనే సచ్చిపోతాడు.

అచ్చి: సాల్లే నీ యాసికోలు. యెప్పుడూ అలాంటి మాటలాడబోక. అలాంటి పాటలు పాడబోక. నీకు నాకు మాటొస్తాది. యిద్దరికి కులం తప్పేస్తారు.

కిత్త: కులానికి మనం తప్పెయ్యలేమా ?

అచ్చి: తప్పేసి మనమేడకు పోవాల ?

కిత్త: నో! రంగం సెగిసిపోదాములే.

అచ్చి: సాలు సాలు, వోరయినా యినిపోతారు.

కిత్త: అచ్చీ! అచ్చీ! యంతపెద్దనకోయ్! వోరడునక్క!!

అచ్చి: నోలమ్మో!! (కిత్తయ్యను కౌగిలించుకొంటున్నది.)

కిత్త: బయం నేనులే, బయం నేను. కిత్తయ్యుంటే నీకేం బయం ?

అచ్చి: (వదల్చుకొని) యాదీ, నక్కన్నావు ? యాడా నేదే!

కిత్త: నీ తాత నేమూ, వోరడునక్క ? అడుగడుగో వొ-గున్నాడు !

అచ్చి: ఓయబోయ్! యేం దారి ?

కిత్త: మనల్ని సూసినాడో యాంటో ?

అచ్చి: (చూచి) సూడనేనులే. గుడ్డోడు. యాడికో పోతు-న్నాడు.

కిత్త: అచ్చీ, నీకొన్ని పాటలొస్తాయో! నాకోటి సెప్పవూ ?

అచ్చి: సెప్తానుగాని, నీకొచ్చినపాట నాకు సెప్తావా ?

కిష్ట: సెప్తానులే, నువ్వు ముందర సెప్పు.

అచ్చి: యి నయితే— (పాడుతున్నది.)

సిరిసిరి మువ్వా — సిరి
గంటలతో మోగేటి — సిరిసిరిమువ్వ - యీ
అనంతపురంలోను ,, — కానా
అల్లర పెట్టినావె ,, - అ
పెనుగొండ సీమలోను ,, - యంకో
వెంకటతనం సేసినావె ,, - అ
యిందూపురములోన ,, - యెన్కో
యింతలు సేసినావె ,, - అల్ల
పెన్నోబలములోన ,, - సి
పెగ్గంత సూపినావె ,, - అ
కదిరి పరుసలోన ,, - నువ్వు
జెమురులేక వాదిరినావె ,, - అయ్యో
కల్యాణసుగ్గాన ,, - నా
కొలుజారి పోనావె ,,

కిష్ట: యీ పాటబాగునేను. ఒక్కసోట నిలబడనేనో, సి సిరిసిరిమువ్వ.

అచ్చి: అది నా సిరిసిరిమువ్వకాదు, సిది. పోనిలే, మరొక్క— పాట సెప్పతా విను.

కిత్త: చెప్పు.

అచ్చి: కిచకిచ మంటూ - కిలకిల మంటూ
ఎగురుతు తుళ్ళుతు - కిందికి మీదికి
గిరగిర తిరుగుతు - గెంతులువేస్తూ
పిచికా పిచికీ - ఉండేవి.

కిత్త: బలే, బలే, అచ్చంగా అచ్చి, కిత్తయ్యా! కానీ, కానీ!

అచ్చి: పిచిక మెృక్కడ - కిచకిచమంటే
పిచికయ్యక్కడ - కిచకిచమంటూ
యింత యింతగా - యెంబడించుతూ
యిచ్చలయిడిగా - తిరిగేవి.

కిత్త: నవ్వా! నవ్వా! యాడ నేర్చినావోగాని యినసక్కగుంది. చెవ్వుల తుప్పొదిలిపోయింది.

అచ్చి: సాలునే, యాదీ నీపాట?

కిత్త: నా కొక్కటీ రాదే!

అచ్చి: దొంగమాటలు. కిత్తయ్యకి పాటలు రాకపోడ మేంటి? నాసేత పాడించుకోని, నువ్వు పాడనంటావా? నాకు కోపమొస్తాది సూడు.

కిత్త: ఒయ్యాబ్బా, నీకోపం! కోప్పడితే నీకిత్తయ్యుండగలడా? నేర్చుకో, సెప్తాను. (పాడుతున్నాడు)
"తోటలో కిత్తయ్య"

అచ్చి: కిత్తయ్యేటి? ఛూత్, యీపాట వాకొద్దు.

కిత్త: యిను, యెంత మంచిపా టనుకోన్నావో!

"తోటలో కిత్తయ్య - మోటతోలుతుంటె"—

అచ్చి: మోట తోలుతే?

కిత్త: నువ్వు నేర్సుకుంటానన్నావే? మరి నాయెనక పాడవా?

అచ్చి: అంతా పాడు. బాగుంతే సేర్సుకోంటాను.

కిత్త: అయితే యిను.—

"తోటలో కిత్తయ్య - మోట తోలుతుంటె-
అచ్చి యెనకనుంచి - వొసాది,
చద్ది తెస్తాది - తిని - పిస్తాది."

అచ్చి: వో, సాలులే. నీ మొవానికి తినిపించాలకూడాను.

కిత్త: (పాడుతున్నాడు)

"నాను పాడంగానె - తాను పాడకుంటె
కిత్తయ్యకి కోప - మొస్తాది
అచ్చి నొస్తాది - కొట్టు - వస్తాది."

అచ్చి: (కొట్టవస్తూ) కొడతానా, కొట్టినూస్తానా? సాలింకే పాట, పాడినావంటే నూ దేమిసేసానో!

కిత్త: (ఎడముగాపోతూ)

"కొట్టవొచ్చేరయేళ - కూడదీసుకొంటె
అచ్చి నన్ను నూచి - మెస్తాది
దయ-వొస్తాది - ము - ద్దిస్తాది."

(ముద్దు పెట్టుకొంటున్నాడు)

అచ్చి: (పలుకుతో) కిత్తయ్యకి పదం కట్టడంకూడా వొస్తాదే! యాడనేర్చినావు, మామా, పదం కట్టడం?

కిత్త: అప్పయ్యశాత్తరం సదివినాను, అప్పయ్యశాత్తరం. నానెంత సమువుకొన్నోడి ననుకొన్నావో!

అచ్చి: ఆశాత్తరం ఏకోరు సెప్పినారో!

కిత్త: శాత్తుర్లయ్యోరు నేదూ, పంచాంగమయ్యోరు? ఆయన సిసువుణ్ణి, నాను.

అచ్చి: నీకు పంచాంగం సెప్పడంకూడా వొత్తాదా, మామా?

కిత్త: వో! నీ పంచాంగం యినిపించనా?

అచ్చి: నా పంచాంగం మాటకేం? నీ పంచాంగం సెప్పుకో, సూదాము!

కిత్త: సెప్పనా? యింటావో, యినవో!

అచ్చి: యింటానులే, సెప్పు.

కిత్త: పాటతో సెప్పనా! మాటతో సెప్పనా?

అచ్చి: పాటొద్దురే. మాటతోనే సెప్పు.

కిత్త: ఆ ప్పిమయగా వుంటే మాటతో సెప్పనేమి? అచ్చిని సూత్తే సచ్చికోడిక్కూడా కయ్యిత్తం పుడతాది.

"అచ్చి నాతో కూడ – వొత్తాది – వొచ్చి
అచ్చికట్ట బుచ్చికట్ట – సేత్తాది."

అచ్చి: ఛా! యివా, పంచాంగమంటే?

కిత్త: మరే టనుకొన్నావు? ఇదే శాస్త్రమన్యాయ నాకు సెప్పింది.

అచ్చి: యీపంచాంగం నాకొద్దు.

కిత్త: "కళ్లుయిప్పి నన్ను – సూత్తాది – నా
వొళ్లు ఝల్లుమని – పిత్తాది."

అచ్చి: సాలు మామో, నీపంచాంగం. యింటికెళ్తా. పొద్దు తిక్కు తిప్పోతాఉంది.

కిత్త: "పులికిపోతూ సేర – వొత్తాది – నా
తలలోకి టక్కు యెం – త్తాది."

అచ్చి: అమ్మగో, మా తాత యీదారినే వొత్తున్నాడు. పాసక్ని సూత్తే కట్టెతిరిగేత్తాడు. పారిపో, పారిపో.

కిష్ట: సూసినానులే. ఇదిగో అచ్చీ, ఒక్క మాట.

అచ్చి: ఏమిటది?

కిష్ట: మనం మళ్ళీ యెప్పుడు కలుసుకోడం?

అచ్చి: (సిగ్గుతో) మన పెళ్ళప్పుడే. మావోళ్ళ నొప్పించుకో.

కిష్ట: మరి మీవోళ్ళొప్పుకొంటారా?

అచ్చి: పంచాంగం సదివినోడివి నీకు తెలకుండా వుంటాదా?

కిష్ట: నా పంచాంగం, నీ పంచాంగం తెలుస్తాదిగాని, మీ వోళ్ల పంచాంగం నా కెలా తెలుస్తాది?

అచ్చి: అయ్యోరికి దచ్చిన నిస్తే మనక్కావాలసిన పంచాంగం సెప్పడూ? మావోళ్ళక్కూడా యిమ్ముకొంటే. అతే సెప్తాడు.

కిష్ట: మరి నీపంచాంగం సెప్పడానికి నాకు దచ్చినో స్తాదా, రాదా? ఆ దాళ్ళ కిచ్చేసి, నువ్వే వొప్పించు.

అచ్చి: సూసుకొందాములే. పొద్దోయింది. నాను పోతాను. మావోళ్ళు మంచోళ్ళు కారు. మన సంగతి తెలుస్తే యెముక లిరగ్గొడతారు.

కిష్ట: మరి నీమనసేటో సెప్పినావుకావు.

అచ్చి: నీ మనుసే నా మనుసు.

కీర్తి: అయితే పెగు. తూర్పు తెల్లారేసరికి తుంగభద్ర
 చేరుకొందాం.

అచ్చి: పద. నీయిష్టమే కానీ. (పాడుకొంటూపోతారు)

ఆడిరా – నా – గుండె – చెదర – మధుర – వె – న్నెలలోన
నిసుగకు – మారమైతిని – గదర – చెలీ – మోహనరంగ – నిముసకు–.

కనుల – కాటుక పెట్టి – కడవ – చం – కను పెట్టి
కన్నీళ్లే – కడవ నింపెను – గదర – చెలీ – మోహనరంగ – కన్నీళ్లే

మంచినీళ్లే – బావికాడ – మల్లెపూ – ల – తెప్పకట్టి
తెప్పమీ – ద – తేలిపోదాం – పదరా – చెలీ – మోహనరంగ –
తెప్పమీద.

(పోతారు)

తెర.

రంగము ౨.

(తుంగభద్రాతీరము. గుడిసెముందు చెట్టుక్రింద. అచ్చి, కిత్తయ్య.)

కిత్త: అచ్చీ, అవుల్ని దూడల్ని వొదిలినావా, మేతకి?

అచ్చి: వొదిల్నా; రా, కూకో కూడు తిందాం.

(కంచం పెట్టుకొని యిద్దరున్ను కూర్చుంటున్నారు.)

కిత్త: ఏమచ్చీ, నంచుకోడాని కేమీ సెయ్యానేదే!

అచ్చి: యిదిగో, యీ మాగడ నంచుకో.

కిత్త: నాలిక సురుస్రుమన్న ట్టేమీ రేకపోతే యెలా?

అచ్చి: చెంప సురుస్రుమనాల. మాగడ తినమంటే యేం తీపి దిగేసింది.

కిత్త: యెప్పుడూ మాగడే? యెప్పుడూ పాలే? యెప్పుడూ జున్నే? యిసుగెత్తి పోతున్నాది.

అచ్చి: నీ యచ్చికూడా యిసుగెత్తి పోతున్నాదేమో?

కిత్త: అచ్చేల యిసుగెస్తాది! అయిటయిటికే రుచి మారిపో-తావుంటాది నాయచ్చి. సేరదీసిందంటే తీపి; కసిరిందంటే కారం; వూసుసుంటే వుప్పు; దూరం పోయిందంటే

పుల్ల; నికాకుపడితే నేను;—అన్ని కలుస్తేనే అచ్చి. నేకపోతే మొగం మొత్తిపోదూ?

అచ్చి: అయితే. నీకు తీపి యిసుగెత్తిందన్నమాటే. కారమే కావాలగదా?

కిత: తీపి తరవాత కారం; కారం తరవాత తీపి. యెలుతురు పోతే సీకటి; సీకటిపోతే యెలుతురు వొస్తుందవ్వా!

అచ్చి: నాకెప్పుడూ తీపే కావాల. యెప్పుడూ యెలుతురే కావాల. సీకటొస్తే దిగులేస్తాది.

కిత: నా నుండగా నీకేటి దిగులు?

అచ్చి: దిగులేనట్నా! నీమాట లింటావుంటే, ఆదేటో అగ్గాలు తగులుతా వుంటాయి, నా మనుసుకి. నాకు దినాము కలలే. రేతిరి నిదరొట్టడం లేదు.

కిత: యేం కల లొచ్చినాయి?

అచ్చి: అదోడ్డో నల్లగున్నాడు. మనగుడిసెలో దూరినాడు. మంచం కింద పొంచున్నాడంట. మనమాటలన్నీ యిన్నాడంట. అబ్బా! అది తల్సుకొంటే వొళ్ళు జల్లుమంటున్నాది.

కిత: అడేమి సేసినాడేటి?

అచ్చి: మంచం కిందినుంచి మెల్లిగా వొస్తావుంటే, తుళ్ళిపడి
నిగ్గొంతుక గట్టిగా పట్టుకొన్నాను. (మెడ కౌగిలించు-
కొంటున్నది.) ను వ్యక్కిళ్ళ-రిబిక్కి రయినావు. 'వొదులు,
వొదులు' అని నన్నిడిపించుకొని దూరంగా పోనావు.
తరవాత నాకు నువ్వు కనబడ్డమే నేను అడు నన్ను
"నడు, నడు" అని గెంటుక పోయినాడు. అబ్బా
మామా, నాకు బయమేస్తున్నాది.

కిష్ట: ఓస్ యెర్రిదానా, నానుండగా నీకేం బయం? రా,
బుర్వతిను. యేటిగట్టుకు పోయి అవుల్ని తోలకొస్తాము.
నూడు, మన లక్కావు నేడో, రేపో యీనతాది సుమా.
నాను సెప్పినాను నూడు, అది కోడెమాద నేస్తాది.

అచ్చి: నేను, నేను, అవుదూడనే యేస్తాది. నీకేటి తెలుస్తాది,
యీనడం సంగతి? మొగోడివిగనక మొగదూడంటావు.

కిష్ట: పందెమా, మరి?

అచ్చి: ఆ, పందెమే.

కిష్ట: యేం పందెం, సెప్పు.

అచ్చి: కోడె దూడనేస్తే నీది; పెయ్యదూడనేస్తే మనది.

కిష్ట: యెంతగడుసుది! నా నొప్పుకోను. మరొక్క పందెం
సెప్పు.

అచ్చి: పెయ్యదూడనేస్తే, గుడిసెలో పనంతా నీది. కోడెదూడ నేస్తే బయటిపనంతా నాది.

కిత్త: అబ్బో, నాయచ్చీ! నన్నాడదాన్ని సేస్తావో? నువ్వు మొగోడివయి పెద్దరికాలు సేస్తావో? కానిలే, వొప్పు-కొన్నా.

అచ్చి: మామా, మామా, అనుగో రేటిమీంచి పడవొస్తున్నాది. రొంపమా యీదిక్కు పడవరానేదే! అల్లో ల్లో!

కిత్త: ఓల్లో, అల్లదారి వాళ్లుపోతావున్నారు. మనకేల?

అచ్చి: మనకోస మోరయినా రానేముగదా?

కిత్త: మనకోస మోకొస్తారు? మనమీదనున్నట్టు ఓలికీ తెలుసులే.

అచ్చి: ఆ ల్లెంతసక్కంగా పాడతున్నారో! మామా. నీకా-పాటలేమేనా వొత్తాయా?

కిత్త: నా పాటల అచ్చి! యేం, నువ్వాపాటలు నేర్సుకొంటావా!

అచ్చి: యాదీ, వొక్కపాట సెప్పు, సూదాము?

కిత్త: నేర్సుకో మడి.—

పొంగుతాది - జీవం - కుంగుతాదీ,
పొంగు కుంగు - పనిరేముంది
తొంగున్నోడికి - తొరయేముంది

కుంగి నోడే _ కొప కేలాగో
వొంగుకాడని - బోలుకుకోండి పాంగు.

కింది కర్లారి - మర్లి - మీదికర్లాలి
కిందూ మీదూ - ఊగులాటాడె
అంద కుంకా - అణిగి ఉంది
కిందని కించ - పడకండి, మరి
మీదని మిడిసి _ పడకండన్నా. పాంగు.

అచ్చి: యెంకి యేదాంతం. యాడ నేర్చినావు, మామా. యీపాట!

కిష్ట: సిన్నప్పుడు కిట్టమీద తిరిగినాను. ఆకిట్టయేణమ్మ తల్లి పేరె మాయమ్మ నాకెట్టింది.

అచ్చి: పాటబాగుంది సుమా. యాదీ మరొక్కటి!

కిష్ట: (పాడుతున్నాడు)

యెత్తర తెరసాప _ వోడమీది సిన్నవోడె... యెత్తర

కోల కట్టిపెట్టరయ్యా _ వోలపాట పాడరయ్యా
యేలరయ్యా అలిసిపోతా - వింక కూసుముందుదాము...యెత్తర

రింగిణీలు కట్టరయ్యా - రేవుకు మొక్కు పెట్టరయ్యా
లంగరెత్తు కోనివుండి _ గంగమ్మకి దణ్ణమెట్టి... యెత్తర

జాయిచక్కగుందిరయ్యా – హాయిగ పోతుందిరయ్యా
తోయగ నక్కరలేదు – తొందరగా నడుస్తాది... యొ త్తర
ఎక్కరలేదు దిదరలేదు – సమనుగానె పోతున్నాది
అనునుచూచి కొయ్యనిలిపి - అంబాలు లాగిపట్టె... యొ త్తర
గాలి నిండుకోని వుంది – కదిలిపోతున్నాది నావ
రేయిల నూస్సూవూరుకొంటా – కెరిత్తె మెగ మేసుకోని...యొ త్తర
చూడ్ నక్కనైననావ – సొంపులు గులికేటినావ
పోడవ దక్కానికి సా - రాజ్యానికె శ్రైనావ... యొ త్తర

అచ్చి: శాబాసు! వోరుకట్టినారో, యీ పదం? యెంత నక్కగుందో!

కి త్రి: మా పెదవమీ దొకయ్యో రుండేవోడులే. పేరు మరిచి-పోనాను. అఁ! అఁ! నారాణప్పయ్యో రాయనపేరు. మూత్తానికేమీ తెలన ట్టుండేవోడు గాని, యాడి కళ్లేసే వోడో! పదాలంటే పదాలుకావు. ఆ అయ్యోరి కడుపు నిం...డా పదాలే.

అచ్చి: యాదీ, అయ్యోరి పదం, మరొక్కటి?

కి త్రి: రా, పాడుకొంటా పోదాం: నువ్వూపాడు.—

దణ్ణాలే – దణ్ణాలు
మా తుంగ - బద్రిమ్మ – దణ్ణాలు

నిండుదయతో నేలె — దణ్ణాలు
మాతుంగ — బద్రమ్మ — దణ్ణాలు
పొంగి పా — ల్లి రాయే — దణ్ణాలు
మనసు — పొంగింపరావమ్మ — దణ్ణాలు
పాయ — పాయలై — రావమ్మ — దణ్ణాలు
పాడి — పంటల నివ్వవే — దణ్ణాలు
నిను నమ్ముకొన్నామె — దణ్ణాలు
తల్లి — నీదయ — చూపవే — దణ్ణాలు.

(పోతారు)

తెర.

## రంగము 3.

[తుంగభద్ర ఒడ్డు. శెట్టెయ్య గుడిసె, గుడిసెలో అచ్చి. ఇద్దరు పడవవాళ్లు ప్రవేశము.]

ఒకడు: సోరయ్యా, గుడిసెలో?

(అచ్చి తలుపుతీసి ప్రవేశిస్తున్నది.)

అచ్చి: సోరది? సోరుమీరు?

రెండో: మొటిలో పడవ మెరకెక్కిపోనాది. తొయ్యాలంటే యీలులేకండావుంది. యీడ నేదయినా మొగో- ళ్లున్నారా?

అచ్చి: మాయింటోడు పశువులెంట పోనాడు. మరోరూ నేను.

ఒకడు: యెంతసేపవుతాదో, వొచ్చేసరికి?

అచ్చి: అలబొద్దేళవుతాది. మద్దెన్న యింటికిరాడు. నానే కూడోట్టుకపోతా.

రెండో: అయితే, అయనొచ్చింటాకా యీడనే వుండాల గావాల.

అచ్చి: అక్కర్లేదు, పొండి. అనుగనుగో అకొండకాడ మర్రి- సెట్టు నేదూ? అదనుంటాడు. పిలుసే వొస్తాడు.

ఒకడు: మామూ నడవలేము. ఎండబడి పోనాము.—పిల్లా, దాగానికి కొన్నీళ్లు సిక్కుతాయా?

అచ్చి: దానికేం బాగ్గెం? (లోపలికి పోతున్నది.)

రెండో: వోరే, యెంతసక్కగుందిరా, యిది? యీడ నేలుందో? సుట్టుపక్క లేడా కొంపే కనబడదే!

ఒకడు: యేమిరో, దీనిమీద కన్నేసినావా, యేటి? సెక్కా—వాలా, సెప్పు.

రెండో: మరి సాయం సేస్తావా?

ఒకడు: అదెంత పనిలే.

రెండో: దానిమొగు డెలాంటోడో! అడిగ్గానా కనబడి నా-మంటే, సిక్కులో బడతామే!

ఒకడు: అవూసు సికేల? వుండు. అదుగో వొస్తున్నాది.

(అచ్చి ప్రివేశము.)

అచ్చి: యిదుగో, దాగం పుచ్చుకోండి. (ఇస్తున్నది.)

ఒకడు: అహాహా. పానాలు లేసొచ్చినాయి. మజ్జగతేట, మా బాగుంది! తాగురా నువ్వుకూడా.

రెండో: యేదీ? (అచ్చిపోస్తున్నది.)

అచ్చి: యేమన్నా, యింకా పొయ్యనా?

రెండో: మరొద్దు, మరొద్దు. కడుపు నిండిపోనాది.

అచ్చి: యావూరన్నా మీది?

ఒకడు: మాది కానా కానా దూరం రాజ్యం.

అచ్చి: యెంతదూర ముంటాదో?

రెండో: ఓయబ్బో! కానా కానా దూరం.

అచ్చి: ఇటేప పోతున్నారో?

ఒకడు: కానా కానా దూరం.

అచ్చి: అంటే యావూరో?

రెండో: బెజవాడావల బందరు పోవాల.

అచ్చి: ఆ బందరీపకు పదిపరువు లుండీనా?

ఒకడు: (నవ్వుతూ) ఎయ్యిపరువు లుంటాది. ఏకెం సూడాల-నుందా?

అచ్చి: నాకేల? మాయింటో డొకనాడు అవ్వారికేగు సప్పితే యాదికొచ్చి అడిగినాను.

రెండో: మీయింటోడి పేరేటి, పిల్లా?

అచ్చి: (సిగ్గుతో ఊరుకొంటున్నది.)

ఒకడు: అయ్యో, అదే టలా సిగ్గొడతావు?

అచ్చి: మామ మాయింటోడి పేరు చెప్పము.

రంగో: వొరే, మామంచి పిల్లరా; అలావుండాల అలుమగ-
లంటే. అయితే, పిల్లా, యీడనొచ్చి వున్నావేటి?
సుట్టుపక్క లోన్నరూ నేరే! నీకు బయం నేదూ?

అచ్చి: నాకి త్తయ్యుంటే నాకేటి బయం?

ఒకడు: ఓహో, అదా నీయింటోడి పేరు?

అచ్చి: (సిగ్గుతో ఊరుకొంటున్నది.)

ఒకడు: (జ్ఞాపకము వచ్చినట్టు నటిస్తూ) ఏటేటి? కిత్తయ్యా?
అడిపే రదేగదంటూ సెప్పినాడు?

రంగో. అవును, పాప మీపాటి కేమయుంటాదో! బతకొచ్చును,

అచ్చి: (భయముతో) వోరన్నా? యేం టంటున్నావు?

ఒకడు: పాపం, మేమొస్తావుంటే, నట్టేట్లో కిందా మీదా
మునుగుతున్నాడు. పడవ బికీని గడిపి, ఏట్లోకి సుమికి
లోని కక్కించినాము. కొనూపిరితో వున్నాడు. అడిని
తీసుకపోయి యేటావల వూరిచావిడిలో యేసినాము.
కడుపుమీదేసి నొక్కినాము. కానానీళ్లు బయటికొచ్చేసి
నాయి. కొంచెం కళ్లు తెరిచినాడు. పేరడుగుతే 'కి-'
అని మరి చెప్పనేకపోయినాడు. నీవూరేదంటే యీ
పక్కకి కళ్ళుతిప్పి, వూరుకొన్నాడు.

అచ్చి: ఆఁ! ఆఁ! నా కిత్తయ్యో; నాకిత్తయ్యో! నాకొంప ముంచేసినావమా! అన్నా, నిజంగా నాకిత్తయ్యేనా?

రెండో: నీకిత్తయ్యో, యాకిత్తయ్యో, మాకెల్లా తెలుస్తాది.

అచ్చి: నూమా, పామనసాయగా వుంటాడు గందా?

ఒకడు: అవును, కొంచెమలాగే వుంటాడు.

అచ్చి: నూనూగు మీసాలుంటాయిగందా?

రెండో: అవునవును. తుమ్మెదలలాగ న...ల్లగున్నాయి.

అచ్చి: నూప స...క్కని మొకముగందా?

ఒకడు: అసక్కదనం నీకే తెలియాల.

అచ్చి: నీకంటా కసింత పొడుగ్గుంటాడుగందా?

ఒకడు: కొంచెం నాయొత్తే.

అచ్చి: దండలు తిరిగుంటాయి

రెండో: వో! మంచి బలంకలోడే. అందుకాతే అంతసేపు నీల్లో యీదినాడు. పాప మాఖరి కలిసిపోనాము. యేం సేస్తాడు?

అచ్చి: నాకిత్తయ్యాలా నీటిలోకి దిగడే! నామీ దొట్టేసుకొ-న్నాడే, దిగనని!

ఒకడు: ఆవు నీటిలో దిగొద్దాదంట. దానికోసం అడున్ను దిగినాడు.

అచ్చి: అన్నా! అన్నా! నూడు! నాకిగయ్యేకి మడిబు-మద్దని పుట్టుమచ్చ నూసినావా!

రెండో. అయ్యో, పాపం దీని మొగు డేనురా!

అచ్చి: పుట్టు మచ్చుండీ? నాకిగయ్యే! నాకిగయ్యే! మామోయి, మామా! నాబతు కద్యావన్నం సేసినావురో! మామోయి, మామ! నన్నెవడకు పొమ్మన్నావురో. మామా! నన్నొరి కొప్పసెప్పినావురో, మామా, నా మామా!

ఒకడు: ఏంసుకేడుస్తావు, పిల్లా? బతికుంటే అదే [illegible].

అచ్చి: నా పాణాలుంటివురో, నా మామా! నీ మొగమేత్తిలో. నా మామా! మరినాకు కనబడవా, నా మామా, నామకూడా సచ్చిపోతానురో, నా మామ!

రెండో. యిదేటి పిల్లా, యిలా అపశకునంగా యేడుస్తావు! బతికే వుంటాడులే.

అచ్చి. బతికుంటాడా? అన్నా, నన్ను నాకిగయ్యేకాడకు దిగబెట్టరూ? యీ పున్నెం కట్టుకోరూ! యిసుగో, యీకోట, యీయిల్లు, యీయావులు, యీమాపిలు,

అన్నీ మీకే యిచ్చేస్తా. వాకిత్తయ్యని నాకు సూపిం-
చండన్నా! మీ మేలు మరిసిపోను, వాయన్నా!

ఒక పు: ఇకేటిరా, యీగొడవ తెచ్చిపెట్టుకొన్నాము?

రెం పో: పోనీలే. పాపం. ఈపిల్లని చేర్చేసే పోదాము.
ఊరికే కొట్టుకొంటున్నాది. మనకి పొద్దో తే పోయింది.
నువ్వు ముందరపో. పడవని ఒటిలోని కీడ్చివుంచు.
నా వెనక నించి యీపిలని తీసుకొస్తాను.

ఒక పు: నువ్వేపో, నా నేతీసుకొస్తాను.

రెం పో: అక్కిల్లికి బయమేస్తాది. ఇద్దరమూ తీసుక పోదాములే.
ఏం పిల్లా, గుడిసె వాకలేసుకో: యేమేమి చూసు-
కోవాలో చూసుకో.

అచ్చి: నాకేమీ, అక్కర్లేదన్నా! నాకేమీ అక్కర్లేదు.
ఒకని పదండి.

ఒక పు: అయితే రా, పద.

అచ్చి: నా మామో, నా మామ!

(పోతారు.)

రంగము ౪.

[సుంకనేన) ఒడ్డు. గుడిసెముందు. క్రిష్టయ్య ప్రవేశము.]

క్రి: యేం, పెవ్వాం, అచ్చి యీదినం యెదరగా రాలేదు! ఇంట్లో యాదోపని సేసుకొంటువ్వాది కాబోల. యాదో యింటు సెయ్యాల వనుకోనుంటాది. దానికి తెలకుండా యెళ్ళి కళ్ళుమూస్తా. (చప్పుడు సెయ్యకుండా నడుస్తున్నాడు. తొంగిచూచి)—యింట్లోనైదే! యాడైనా దాంగోనుంటాది. నన్ను బయంపెట్టడానికి... తెలిసిందిలే అచ్చి, తెలిసిందిలే. వాకిలోరని దాంగున్నావో! రా, బయటికిరా. (పోయిచూస్తాడు.) ఈడనైదే! ఓహో, మంచంకిందనో! (మూస్తాడు) అరే! యింట్లో లేనట్టే... సుట్టుపక్క లెక్కడా కినబడనైదే! మద్దెన్నం కూడా కూడొట్టుకు రాలేదు. ఏటిగ్గానా పోయిందా? యేటొడ్డునుంచే వొచ్చినానే!— నేను, నేను, యీపైన యాడనోవుంటాది... అచ్చి! అచ్చి!... పలకనేదు. ఆ! అనుగనుగో నాయచ్చి! (పోయి మూస్తాడు) అయ్యో, యాదో తీగ... అచ్చి! యాడకుపోయినా వచ్చి'... అదిగో పలుకుతున్నది (చెవి ఒగ్గి విని) యాదో పచ్చి... అనుస్తున్నాది... అచ్చి! పలకవే మచ్చి! నన్నెంను కాడిస్తావే, నాయచ్చి! ఓకీనిరా... ఏం, రావేం! నామీద

రచ్చించుకోవమ్మ – పోతుంగబద్రిమ్మ –
రచ్చించుకొని వుండవమ్మా

పచ్చిక బయళ్లోన – పారాడుతుంటాయి –
బద్రిమ్మ అవి బద్రిమమ్మా.

గోడావు – నల్లావు – బక్కావు – లక్కావు
చూడితో వున్నాయె తల్లీ !

మాపు నేనే యేళ – తొందరలు లేకుండ
నూడు నీవే దిక్కు – సుమ్మా.

(పోతాడు)

రంగము ౫

[బెజవాడ వీధి. కొంతమంది జెండాలు పట్టుకొని పాటపాడుతూ పోతూఉంటారు. ఒకడు పాడుతూ వుంటే, వెనుక తక్కినవాళ్లు పాడుతూ ఉంటారు.]

దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము

ఎండల మలమల - మాడెదము
వానల వడవడ - వడకెదము
గున్న గొంపిలో - దొరలెదము
విత్తి ధాన్యముల - నెత్తెదము
భామంతుల పా - దాలసన్నిధని
గడగడమని అ - ల్లించెదము
పండించుటకు - బాధ్యులము
తినుటకె మేమతి - దీనులము

దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము

గనులను త్రివ్వగ - గడగెదము
అడుగున బడి క - ష్టించెదము
మణులను బయటికి - తీసెదము
రాజుల శిరముల - పేర్చెదము

రాజాల గుత్తలు చెల్లించుటకు ని-
రాటంకముగా - బాధ్యులము
గుత్తలు కట్టెడి - తొత్తులము
మాటాడగ నతి - దీనులము.

[కిష్టయ్య ప్రవేశము.]

కిష్టయ్య: నాయచ్చి నెతుక్కుంటూ యీవూరు సేరుకొన్నాను. ఆనాడు నూవిన పడవమీదోల్లపనే అయి వుంటాది. యీపనయినా కనబడతాదో, నేదో!

ఒకడు: ఎవరక్కడ, నిలబడు.

కిష్ట: మీరోరు? నన్నేల నిలబడమంటారు?

ఒకడు: నువ్వెవరు?

కిష్ట: (తనలో) నాఅచ్చిసంగతీళ్ళతో యెలచెప్పాల. (ప్రకాశముగా) నాను కూలోడిని. కూలి దొరుకుతాదేమో అని యీవూరొచ్చినాను.

ఒకడు: యీవూళ్లో కూలిలేక మేమే యిలాగ తిరుగుతావుంటె నువ్వొకడివి చేరినావూ? మాతో చెప్పకుండా యీవూరెందుకొచ్చినావు!

కిష్ట: యీవూరు రాడానిక్కూడా మీ ఆగ్గుండాలా? నాను తెలనేను.

ఒకడు: యీవూళ్ళో కూలోళ్ళంతా వొకకట్టు. అన్ని పెద్దలకి తెలనిదీ యెవరూ కూలిసెయ్యకూడ దీవూళ్ళో. నువ్వు యేరే కూలికిపోతే ఏపానాలుండవు సూసుకో.

కృష్ణ: మీరు బతకా బతకరు, ఒకరిని బతకానివ్వరా? ఇదేటి అన్యాయం? మరి మీరే సూపించండి నాకు కూలి మీతోనే కలుస్తాను.

ఒకడు: అయితే రా, ఈజెండా పట్టుకో.

కృష్ణ: ఈజెండాయేల? నాకు జెండాలసంగతి తెలదు. యేం మాటొస్తాదో, నాకక్కరలేదు [illegible] కష్టం సేసి పోతే మూకూరు పోతాను.

ఒకడు: హాయ్! మాట్లాడొద్దు! పట్టుకో, నడు. కానకుంటే పారిపోతావేమో: ముందునడు. మాము పాడినపాట నువ్వున్ను పాడతావుండు.

కృష్ణ: (తనలో) యిదేటి దేవుడా! నాయచ్చికోసం నా నేను కొచ్చింటాన్రంటే, యీళ్ళ సేతుల్లో పడ్డాను! కాని యేమయితే అదవుతాది.

(అందరున్ను మునుపటిలాగే పాడుతారు.)

దీనులమయ్యా – దీనులము
దిక్కులేని – నిరుపేదలము

మట్టిని అచ్చున - పోసెదము
ఇటికబట్టీల్ - పెట్టెదము
మహాలులు మహడీల్ - కట్టెదము
ధనవంతులకవి - తార్చెదము
కుములుచు మురియుచు - కూర్చుండే ఆ
యయ్యల కడియేన్ - దాసులము.
మహడీల్ కట్టగ - మాన్యులము
తిరుగాడగ నతి - దీనులము.

దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము.

పట్టు నూలులను - వడికెదము
నిగ్గుల బట్టల - నేసెదము
ధనికుల కడకును - చేర్చెదము
వన్నెల మస్తుల - మర్చెదము
సౌఖ్యము సోలుచు - చూచేఅయ్యల
పాదములనుబడి - పట్టెదము
బట్టలు నేయగ - ప్రబలులము
బట్టలు గట్టగ - బడుగులము.

[పోలీసులు ప్రవేశము]

పోలీసు: ఏయ్, నిలబడండి.

ఒక కు: మేము నిలబడేది లేదు. ఈ బాట ఏదా? నువ్వెవ్వరు మమ్మల్ని నిలబెట్టడానికి?

పోలీసు: నేనెవరా? తెలిపిస్తానుండు. నీ పేరు?

ఒక కు: యింతమంది వుంటావుంటే నా పేరే యేల చెప్పాల? అసలు మా పేరడగడానికి నువ్వెవ్వరు?

పోలీసు: ఏ, జవాన్, ఎయ్, ఈడికి బేడీలెయ్.

(వెనకవాళ్ళందరూ పారిపోతున్నారు.)

ఒక కు: పోలీసయ్యా, ఈడు (కిష్టయ్యను చూపి) దమ్ముంటే వొగ్గి నాము. మాకేమీ తెలదు.

పోలీసు: ఎవడీడు? కొత్తమొగంలా వుందే. ఎయ్యాండి బేడీ వీడికికూడా.

కిష్ట: ఏంరా, యిలా సేస్తావు? నామాన నాను పోతావుంటే నన్ను బయటెట్టి, సేతులో యీ కొండాయెట్టి ముందుకు తోసి, మళ్ళీ నామీద పెడతావా? యింతన్యాయంకాల మొచ్చిందా?

ఒక కు: ఈడేనయ్యో. యీడే (పారిపోతున్నారు)

పోలీసు: పట్టుకోండి, పట్టుకోండి (కొందరు పోలీసులు వాని వెంట పరుగెత్తుతారు.) నువ్వు నడు. ఠేసనికి నడు.

కిష్ట: పోలీసప్పా, నన్నెందు కిట్లా సేస్తావు? నా కేకర్మమూ తెలదప్పా. నా పెదివకేం యీవూరొచ్చినాను. యీ శోర్లో నన్ను సంపుతామని బయపెట్టి, యీ జెండా నా సేతులో పెట్టినారప్పా!

పోలీసు: ఎయ్, మట్లాడకు. తిన్న గానడు. నుర్వ్యోళ్ళకి మొనగాడివి.

కిష్ట: లేదప్పా, నాయచ్చి దెసుకొంటా వస్తుంటే, యీళ్ళోను రుపడ్డారు.

పోలీసు: ది యచ్చెవరు!

కిష్ట: నాముద్దులచ్చి, నాపాటలచ్చి, నాకు కనబడకుండా పోనాది.

పోలీసు: అహో, బుహో! యీకదలన్ని కట్టిపెట్టి. నడు. టేసను కాడే అంతా సెప్పుదువు గాని.

కిష్ట:

గ్రాచారమెవరు త - ప్పిస్తారురా - నుదుటి
రాత నెవ్వరు తుడి - సేస్తారురా.

తల్లిదండ్రుల విడిచి - తనవారిని యిడిచి
తరవాత యేమూనా - తల సంగతేటైతి గ్రాచార.

అచ్చి నాలోకమని - అచ్చంగ నమ్ముకొని
మెచ్చి చేరదీస్తి - వొచ్చెర గతినాకు గ్రాచార.

## రంగము ౬.

(బెజవాడ వీధి— ఇద్దరు పడవవాళ్లు, అచ్చి, పరివేశము.)

అచ్చి: నీ తలకొరియుడిపోను! నీ యమ్మకడుపుకాల! నన్నేడ కిరా తీసుకొచ్చినారు?

ఒకడు: ఏయ్, నోరుముయ్, గట్టిగా అర్సినావంటే నోరు నొక్కేస్తాం.

అచ్చి: మీకడుపులో అగ్గెయ్యా! మీమచ్చమాసిపోను! మీ యిల్లు కూలిపోను! నానోరు నొక్కుతారా? ఓరురా మీరు? సొంగిగాడి దల్లారా! కిత్తయ్యో, కిత్తయ్యా, మామోయ్, మామా! ఏడనున్నావురో! రావేమిరో! నా బతు కద్దాన్న మయిపోయెరో! నాకోరు దిక్కురో!

రంగో: ఓపిల్లా, యినుగో నామాటయినా. కేకలేస్తే మంచిపని కాదు. నీకూ మాకూకూడా ముప్పొస్తాది. యీమలో పోయే వోళ్ళంతా యిని సూట్టా మూగుతారు.

అచ్చి: యింటేయినని, మూగుతే మూగని అందరితో సెప్పేస్తా, మీరుసేసినపని. మీకొంపకి కొరివిని. మీపాపాలమీద పిడుగుని. మిమ్మల్ని నాశనం సేసేస్తా. నాకిత్తయ్యకి తెలుస్తే మీకీభూమిమీద రునంతీరిపోతాది. నామాట యినండి. నన్ను నాకిత్తయ్యకాడికి సేర్సియ్యండి.

ఒకడు: ఇదుగో, అచ్చీ, నామాటింటావా, యినవా? ఏకిత్తయ్య సచ్చిపోనాడు. మ రాడా శెట్టుకోకు.

అచ్చి: నా కిత్తయ్య సచ్చిపోనాడా? మీగొంతుకలు కోర కయ్యా! ఆడిదగ్గిరికి తీసుకుపోతామని మభ్యెపెట్టి, యీడకు తీసుకొత్తారా? మీవాలికలు తెగ్గొయ్యా! మీకళ్లు పేలిపోను! మీకాటిలో మూడువేటల బుగ్గి రొత్తం చెయ్యకుండా వూరుకొంటా ననుకొన్నారరా?

రెండో: (నవ్వుతూ) ఏమచ్చీ, యిదుగో!

అచ్చి: మీనవ్వు నాశనంగాను! మీపొగరణిగిపోను! మీకు పెళాలు లేరంటారా? మీ కక్కసెల్లెళ్లు లేరంటారా?

ఒకడు: నువ్వే మాపెళ్లాం. మాబావకి నువ్వు సెల్లెలివి.

అచ్చి: మీనోరొడిపోను! మీసిగాదరగా! ఓకిత్తయ్యో. కిత్తయ్యా! రారో! యీళ్ళనుంచి నన్నుతప్పించుకోరో! ఏడ నున్నావురో!

(పోలీసులు, కిత్తయ్య, ప్రవేశం.)

పోలీసు: నడు, నడు! దిక్కులు సూస్తావేం? పారిపోడానికా?

కిత్త: నాను పారిపోనప్పా! నాఅచ్చేపోయింది నాకీలోకంలో మరో రున్నారు? నడవండి—

పోవాకె - నాయచ్చి - ముద్దుల - నాయచ్చి
పోనావా - యిడిపి - పోనావా - అచ్చి
రావా - నన్నేలు - కోవా

అచ్చి: ఓహో - కిత్తయ్యా - వోయకునా - కిత్తయ్యా
మాటసెప్పియెల్లి - పోరో - కిత్తయ్యా
రారో - యిడిపించు - కోరో.

కిత్తి: తెల్లనా - కొకాన - నల్లమ - బొట్టెట్టింది
కళ్ళలో - మెరిసేది - కన్నీరు - కమ్మింది
రాయే - నన్నప్పు - కోయే - నాయచ్చి.

అచ్చి: పారేటి - నీళ్లలో - పడవపో - తుండంగ
పడవొరిగి - పోయింది - రయ్యో - కిత్తయ్యా
యెడబాపు - వొచ్చింది - మనకో - కిత్తయ్యా.

కిత్తి: నడిమింటి - సూర్యుణ్ణి - మిడినాగు - పట్టింది
మింటిలో - సీకట్లు - మించిపో - తున్నాయి
వాడాని - కేదారి - పొడగట్టు - కున్నాది
రాయే - నిచెయ్యి - యియ్యే - నాయచ్చి.

అచ్చి: కారడవి - లోపల - కన్నగా - నకుంచ
నారి త - ప్పిపోయె - దరిదాపు - లేదాయె
వోరు ది - క్కు-వుకారు - రయ్యో - కిత్తయ్యా
రారో - రచ్చించు - కోరో.

కిత్త: అనుగమగమగో, నాయచ్చి! (పోబోతున్నాడు.)

పోలీసు: హెయ్, నిలు, ఎటుపోతావు?

అచ్చి: అదుగదుగో, నాకిత్తయ్యా! (పోబోతున్నది.)

ఒకడు: హెయ్, నిలు, ఎటుపోతావు;

కిత్త: అచ్చీ! అచ్చీ!

అచ్చి: కిత్తయ్య మామో! కిత్తయ్య మామ!

కిత్త: నన్ను నాయచ్చికాడకు పోనియ్యండి.

పోలీసు: పోడాని కీలులేదు. నడు.

అచ్చి: నాను నాకిత్తయ్య కాడకు పోతాను. పోండి, నా కాడకు రాకండి.

రెండో: పోనువుగాని, పాపం! మాబంగార మేడవాసినావో ముందుసెప్పు.

అచ్చి: మీబంగార మేటి!

ఒకడు: మాపడవలో సెట్టుకొన్నది నువ్వేతీసినావు. ముంగడీడ పెట్టిపో. నేకపోతే పోలీసోళ్ళ కొప్పజెప్తాం.

అచ్చి: మిమ్మల్నే నానొప్పజెప్తాను. మీనాలికొడిపోను! నన్ను మోసంనేసి, నానా అల్లరాపెట్టి, నాను దొంగతనం

తూడా కడతానంటాంరి? వో పోలీసప్పో! పోలీసప్పా!
సూడప్పా, యీాళ్ళిలా సేస్తున్నారో!

పోలీసు; ఎవరురా, అళ్ళు? ఆడదాన్నిలా అల్లరపెడుతున్నారేటి?

ఒకడు: మామేమీ సెయ్యడంలేదు. అయమ్మె మమ్మల్ని వల్లర పెడుతున్నాది.

రెండో: సూడప్పా, పోలీసూ, మాపడవెక్కి, కేవియ్యకుండా, సల్లంగా దిగిపోయింది. మాము పడవలో సెట్టుకున్న బంగార మేడనో దాచీసింది. నువ్వయినా యిప్పించి య్యాప్పా!

పోలీసు: ఓపిల్లా, అల్లకేవు, అళ్ళ బంగారమూనంట, అళ్ళకిచ్చెయ్. ఆడదానివికావూ? జెయిలుకి పోవాల నున్నాదేటి నీకున్న?

అచ్చి: సూవినావా, మామా, యీాళ్ళింతవా దేస్తున్నారో?

కిత్తయ్య: ఏమచ్చీ. నువ్వు దొంగతనం సేసినావంట నే?

అచ్చి: బూదేవి సాచ్చిగా, మామా, నా నేపాకమూ ఎరగను. ఈాళ్ళు నన్ను మోసంసేసి, మనిద్దరికీ యెడబాపులు సేసినారు, మామా!

ఒకడు: ఎయ్, అబద్దాలాడతావా? "కిత్తయ్యతో నాను పడలే కుండావున్నాను. నన్ను బందరు దిగెట్టెయ్యండి" అని మాపడవెక్కసేదూ? ఇక్కడి కొచ్చినతరవాత, మాకే

విర్ర్యాకుండా, మాబంగారమంతా యాడనో దాచీసి, ఇదు కనబడగానే దొంగేదుంపు లేదుంస్తావా?

కిత్త: అవునా, అచ్చీ? నానునీకు సెడయిపోనానో! పో, పో, ఆళ్ళతో నేపో.

అచ్చి: మామా, యీదొంగ నాయాళ్ళమాట నమ్మ్రుతున్నావా! మీకూటిలో దుమ్ముపడ! మీకాటి కగ్గట్టా! రుటా?), సేలినారు?

పోలీసు: ఎయ్, బాటలో అల్లరసేత్తున్నారు. మిమ్మలి నందరిని అరెస్టుసేసినాను. నడవండి. స్టేషనికి.

కండో: మా పేమి సేసినామప్పా, మమ్మలిని నడమంటావు?

పోలీసు: మీ అందరికి ఏదోసంబంధముంది. అంతా కోర్టులోనే తెలుస్తాది పదండి.

అచ్చి: పదండి, నాకు భయంనేను. నానూ, నాకిత్తయ్యా కలిసి నడుస్తాము. ఈళ్ళ నేరేవుంచు, పోలీసప్పా.

ఒకడు: మాకు మాత్రం బయమా? నడు. కాని, పోలీసూ, అల్లిద్దరూ దగ్గరగుంటే మాట్లాడుకుంటారు. ఆళ్ళని కలియనియ్యకు.

పోలీసు: సరే, ఓపిల్లా, నువ్వాళ్ళదగ్గరా ఉండకు, ఈడిదగ్గరా ఉండకు. నాయెనకనుండు. నడు. (పోతారు.)

తెర.

## రంగము ౭.

(బెజవాడ మేజిస్ట్రేటు కోర్టు. మేజిస్ట్రేటు, వకీళ్ళు, కూర్చొని ఉంటారు. గుమాస్తా మేజిస్ట్రేటు ప్రక్క నిలుచొని ఉంటాడు. పోలీసు కాన్స్టేబిలు, కిష్టయ్యను, అచ్చిని, పడవవాళ్ళను తీసుకొని ప్రవేశిస్తాడు.)

మేజి: ఎవరోయి, పోలీసు, ముద్దాయీలను బోనులోని కెక్కించు.

పోలీసు: పదండి, దానిలోని కెక్కండి. (ఎక్కుతున్నారు. వాళ్ళ ప్రక్కను పోలీసు నిలబడుతున్నాడు.)

కిష్ట: అచ్చీ, యీపక్కకిరా, (అచ్చి వస్తున్నది.)

పడ: ఒకడు: దేవరా, అళ్ళిద్దరూ ఒకసోట వుండగూడదు. మాట్లాడుకొంటారు.

మేజి: సరే, వేరవేరే ఉండండి.

అచ్చి: యేం, దేవరా, మాకు నాయ మివ్వవా! యిప్పుడే మ-మ్మల గ్నైదము సేసేస్తున్నావే!

గుమా: ఓ అమ్మో, 'దేవరా' అనకూడదు. తప్పు. 'బాబయ్యో' అనాలి, లేకపోతే 'మహాప్రభో' అనాలి. 'దేవరా' అంటే ఘనమైన కోర్టువారి నవమానించిన ట్లవుతుంది.

అచ్చి: ఆదేమిగోలో. మామట్లాగే ఆనేది. గనమా, గినమా, మాము పలకనేము, అంతింతమాటలు.— ఓయప్పో, నన్నుమాత్రం 'అమ్మో' అనబోక. తరవాత మాటొస్తాది.

మేజ: ఏమే, తిన్నగా మాట్లాడలేవూ!

అచ్చి: దేవరా, నువ్వు గొప్పోడివయితే అయినావుగాని, నన్ను 'ఏమే' అనిమాత్రం పిలక! నానేమి నీపెళ్ళాన్ననా కొన్నవా?

మేజ: ఏమని పిలవాలి?

అచ్చి: 'ఏమమ్మో' అనాల.

మేజ: సరే, నీపేరేమిటి?

అచ్చి: మాపేరలా సెప్పకోము. కిత్తయ్యా నడగండి, సెప్తాడు.

మేజ: దానిపేరేమిరా?

కిత్త: 'రా' అనకు, దేవరా. అట్లాంటే మాకుతప్పు.

మేజ: బాగుంది. నిన్నేమనాలి?

కిత్త: 'ఏమప్పా' అనాల.

మేజ: నువ్వాడివాడవా. 'అప్పా' అనడానికి?

కిత్త: యీదేశంలో అప్పలందరూ ఆడోళ్ళుగావాల. మా దేశంలో అప్పలు మొగోళ్ళే.

మేజి: ఏదేవూ రప్పా?

కిత్త: మాది రుదప్రింపేట.

మేజి: ఎక్కడుంది, ఆరుదప్రింపేట?

కిత్త: యింత సమువుకొన్నోళ్ళు, రుదప్రింపేట యాడనుందో తెలదా?

మేజి: యేజిల్లా? యే తాలూకా?

కిత్త: యావ జిల్లావో, యావతాలుకావో! ఏకేతెలకపోతే, సమువుకొనోడని నాకెలా తెలుస్తాది?

మేజి: ఓయి, పోలీస్, అవూ యెక్కడుందో కనుక్కొని చెప్పు.

పోలీ: చిత్తం.

మేజి: ఏపేరు?

కిత్త: కిత్తయ్య.

మేజి: ఏతండ్రిపేరు.

కిత్త: వోబలేసు.

మేజి: ఏం, హాస్యంచేస్తున్నావా? కోర్టువారి ధిక్కారం క్రింద నిన్ను ప్రాసిక్యూషన్ చేస్తాను చూడు.

కిత్త: ఏమచ్చి, ఆయ ప్పలా కోపంసేస్తాడేల?

పోలీ: ఎయ్, మీరలా మట్లాడుకో కూడదు.

అచ్చి: పోలీసో, ఆయప్పే టంటాడో మాకు తెలనేరు. కస్సు బుస్సు మంటున్నాడు. గిక్కా_ర మంటాడు! పిసికేస నంటాడు! అర్థంకానేను.

మేజి: నీతండ్రిపేరేమిటో నిజంగా చెప్పు.

కిత్త: వోబలేసని సెప్పినానుకావా? మరోడికి పుట్టినానని చెప్పమంటావా యేటి? యిది బాగుందే!

మేజి: నువ్వబద్ధ మాడుతున్నావు. వోబలేసని యెక్క_డనయినా పేరుంటుందా?

కిత్త: వుండదో? మావూరొస్తే యెంతోమంది కనపడతారు వోబలేసులు, వోబయ్యలు, వోబన్నలు.

ఒక వకీలు: ఆదేశములో అటువంటి పేర్లుండవచ్చును. ఘనమైన కోర్టువారు నమ్మకపోవడానికి కారణం కనబడదు.

మేజి: సరే.—ఓయమ్మో!

అచ్చి: అదుగో, మరీ ఆదేమాట!

మేజి: ఓ యమ్మా, నీపేరేమిటి?

కిత్త: దానిపే రచ్చి.

మేజి: సరే. నీభర్తపేరు?

అచ్చి: బరతంటే?

పోలీ: నీ యింటోడి పేరు,

అచ్చి: (కిత్తయ్యవైపు చూస్తుంది.)

మేజి: ఓహో, వాడేనా నీభర్త?

అచ్చి: వాడూ!

మేజి: అయుత్పేనా?

కిత్త: అవును, నానే దానింటోడిని.

పల్లి: కిత్తయ్య అబద్ధమాడుతున్నాడు. వాడు దీనిభర్తకాడు.

అచ్చి: వోరలా అనేది?

మేజి: ఇది ఒక ఇస్యూగా చేర్చమంటారా?

పల్లి: చిత్రము.

మేజి: సరే.—(ఒక పసవవానితో) నీపేరు?

1 పస: మొర్రెడ్డి.

మేజి: ఇదేమిపేరబ్బా! సరే, నీతండ్రిపేరు?

1 పస: బయ్యప్పరెడ్డి.

మేజి: (రెండోపసవవానితో) నీపేరు?

2 పడ: కొట్రియ్య.

మేజి: ఇదేమి వెకాకోళ మనుకొన్నావా? ఎవరినికొట్టమంటావు?

2 పడ: అయ్యో. నాపేరే అది. దేవరా!

మేజి: బాగుంది. తండ్రిపేరు?

2 పడ: చిక్కబసణ్ణ

మేజి: చిక్క—గా నేవుంది, యీపేరు.—మీమీది ఛార్జిలను చెప్తా-తాను, వినండి.—కీర్తయ్యా, నువ్వు కమ్యూనిస్టులలోచేరి, జెండాపట్టుకొని, డిమాన్స్ట్రేషను చేస్తూ, యీ వూళ్లోని ధనవంతుల యిళ్లమీదపడి, దోచుకొనే ఉద్దేశముతో కాన్స్పిరసీ చేసిన అన్‌లాఫుల్-ఎసెంబ్లీలో చేరి, పోలీసు వారు చెదరిపొమ్మని ఆర్డరు చేసినా పోక, చక్రవర్తిగారి న్యాయచట్టము నతిక్రమించినావని పోలీసువారు నీమీద కేసు తెచ్చినారు. ఆ నేరము చేసినావా?

కీర్త: నువ్వనేమాట నాకేమీ తెలవలేదండీ.—పోలీసూ, ఏమి టిదంతా? కమ్మింటుంట, దిం దిం అంట, ఆడోరంట, కంచిపెసరంట, అల్లం బెల్లమంట, ఏమేం గోల తెచ్చి-పెట్టినా రప్పా!

మేజి: ఏమండీ, పబ్లిక్ ప్రాసిక్యూటరుగారూ, వీనికి కేసు స్వభావము తెలియజెప్పండి.

పల్లి: ఓ కిత్తయ్యా, నువ్వు తప్ప ఇంటర్నేషనలుకు చేరినవాడవు గదా!

కిత్త: తా డింటనే సాలంటారా! నాకుబోదపడ్డం నేదు.

పల్లి: ఎంమ్. పెంకపూట లాపకు. నువ్వీదేశములో బోల్షి-విక్ ప్రోపెగేండా చేయతలపెట్టినావా, లేదా?

కిత్త: బోడిపివ్వులేటో, పార్సిగాండేటో, నాకే.. మీ తెలదు.

అచ్చి: నా కేంటారి మామో! నిన్ను బోడిసేస్తారంట పోరప్పకొంపకు సేరుస్తారంట. ఆ కొండేపనుందో! నువ్వేమి సేసినావు. మామా? నిన్నూ నన్నూ యిడదీ-సేస్తారు గాబోల, మామో!

మేజి: పోలీస్, దానిని మాట్లాడవద్దని చెప్పు.

అచ్చి: 'దానిని'! సుతి మించిపోతున్నాదే!

పల్లి: ఘనమైన కోర్టువారు వీనిముఖవైఖరిని కనిపెట్టవలెను. వీ-డేమీ తెలియనట్టు నటిస్తున్నాడు

మేజి: చూస్తున్నాము.—కిత్తయ్యా, నీపక్షాన్ని వకీలు నెవరినైనా పెట్టుకొన్నావా? నువ్వే వాదించుకొంటావా?

కిత్త: అంతింత పెద్దమాటలాడినాడు, అయ్యప్ప వొకీలుకాడా? అయన్నే వోదించమనండి.

మేజి: ఆయన ప్రాసిక్యూషన్ తరఫున వాదిస్తారు. డిఫెన్సుకు నువ్వు వకీలు నేర్పాటుచేసుకో. చేసుకోకపోతే, నువ్వే వాదించుకోవాలి.

కైత్త: పాప్రసిక్కూ సేటో, డిప్పనే సేటో! వోదమంటే నాకు బయం. వోడిస్తే ఆదేటి సిక్కులొస్తాయో!

మేజి: సరే, మేమే ఏర్పాటు చేస్తాము. శ్రీనివాసరాఘవయ్యంగారు గారూ, మీరుకి త్తియ్య పక్షాన్ని వాదిస్తారా?

శ్రీ. రా. అ: ఎనక్కు ఫీజు పానరబిల్ కోస్టవర్ వేరువాప్పదు సెయ్యావాల.

మేజి: సరే, కేసు మొత్తంమీద రు. ౫ లు ఏర్పాటు చేసినాము.

శ్రీ. రా. అ: నా స్టేటస్ ఆలోసిచ్చినాల్ కారే. ఎంతెంత లా-పాయింటుగళ్ వేణ్డుమ్! ఎన్నా కదెయ్!

మేజి: మీకక్కరలేదా? మరెవరికైనా యేర్పాటు చేస్తాము లెండి.—వకీళ్లుగారూ, మీలో ఎవరికైనా యీ కేసులో వకాల్తా కావలిస్తే, వ్రాతమూలకముగా తెలియజేసుకో వచ్చును.

[వకీళ్లు చీట్లువ్రాసి మేజస్ట్రేటు కిస్తారు.]

మేజి: చూచినారా, శ్రీనివాస రాఘవయ్యంగార్ గారూ, నిష్కారణంగా రు. ౧౦ ఫీజు పోగొట్టుకొన్నారు. నేను

చెప్పగానే ఒప్పుకొని ఉంటే యెంత బాగుండేది! హనుమంతప్పగారు రూ. 4 లకే చేస్తామన్నారు.— ఇదెవరిదీ చీటి! జగన్నాథంపంతులుగారు,— రు 2-5-4 లకే చేస్తారట. వీరెవరో!—రాధానాథన్ గారు. (చదువుతున్నాడు.) "ఈకేసు ఇంటర్నేషనల్ ఇంపార్టెన్సు కలది. కమ్యూనిజం, కమ్యూనాలిజం; బోల్షివిజం, శోత్రాయిజం; బహుమారిజం, బలాదూరిజం; దూ-అర్-డైఇజం, యస్-యువర్-ఆనరిజం;- మొదలయిన యెన్నో సమస్యలతో కూడుకొనిఉన్నది. ఇంత ముఖ్యమైన కేసులో పనిచెయ్యడమే యెంతో గౌరవము. ఇటువంటి విషయములో కాంగ్రెస్ సెక్రెటరీగాఉండిన నేను ఫీజుపుచ్చుకొని పనిచేయడము కంటె అవమాన ముండదు. హానరబిల్ కోర్టువారు అనుగ్రహిస్తే నేనూరకే పనిచేయడాని కంగీకరిస్తున్నాను. ఇన్నాళ్లున్న తమకోర్టులో ఒక్క కేసుకూడా పట్టివుంచలేదు. నేను ఊళ్లోపుట్టి, ఈఊళ్లో పెరిగి, ఈఊళ్లోచదివి ప్యాసయి, యీ ఊళ్లోనే బల్లకట్టుకొని, యీకోర్టునే కనిపెట్టుకొని ఉన్నాను. కాబట్టి. యీకేసు నాకే యిప్పించవలెనని ప్రార్థిస్తున్నాను. తమ అనుగ్రహమువల్ల ఈ కేసు గెలుచుకొంటే, నా పేరు ఋషికుల్య నుంచి పినాకిని వరకున్ను, బందరునుంచి బళ్లారివరకున్ను మోగిపోతుంది."

శ్రీ. రా. ఆ: ఈ కేటా రాధావాసన్ గారి గొప్ప చెప్పుకున్నాడారు. ఆయన కాంగ్రెస్ సెక్రెటరీనని తానే కొన్నేన్దా. అసలు క్రిష్ణప్పం గవర్నుమెంటు పాలిసీకి విరుద్ధం.

మేజ: ఆయన యెన్నడో కాంగ్రెస్ సెక్రెటరీగా ఉండేవాడు. ఇప్పుడు లేడుగా.

జగ: ఆయన యేదో డబడబాయమానంగా నాలుగు 'ఇజం' లను విసిరేసేసరికి. కొట్టినారు గుమ్మయి పోయినారు. వాటి అర్థమేమిటో సరిగ్గా చెప్పగలుగుతే ఆయనకే యిస్తా నమ్ముడు. యేమండీ, రాధావాసన్ గారూ, కమ్యూనిజం కు, కమ్యూనాలిజం కు భేదమేమిటండీ?

రాధా: నన్ను తాము క్రాసు వేస్తున్నారా? మీకు తెలియా అడుగుతున్నారా?

జగ: తెలియకే అడుగుతున్నాను, చెప్పండి

రాధా: కమ్యూనిజం అంటే అందరున్ను కలిసి పంచుకోనేది. కొన్ని కో ఆపరేటివ్ సొసయిటీల దేశకట్టడవలె, కమ్యూనాలిజం అంటే అన్ని ఒక్కడే కబళించేసేది; ఎంత తక్కువ ఫీజులకయినా, అన్ని కేసులున్ను తామే పట్టి ఇతర వకీళ్ళకు ఒక్కటిన్ని దక్కనివ్వనితనమవలె. తెలిసిందా, యిప్పుడు!— వీళ్లే మహా గొప్ప 'లా' చదువు కొన్నట్టు, మేము చదువుకోనట్టు!

ను: చాలా బాగా చెప్పినావోయ్, రాధానాథన్! అలా తగులుతూ వుంటేనేగాని యిటువంటివాళ్ళకు బుద్ధిరాదు. మనిద్దరం కలిసి యీకేసు వాదింతాము. నాకు కూడా ఫీజక్కరలేదు.

క: నాకుమాత్రం కావలెననా యేమిటి? ఫీజు పుచ్చుకోకపోతే క్లయింట్లు యెదుట పలుచనవడానికాని, లేకపోతే ప్రొఫెషన్ మీద ఉన్న గౌరవం డబ్బుమీదనే ఉంటే, ఈ పాటికి భాష్యంఅయ్యంగారంతటి వాడినై ఉండేనూ! సరే, నేనుకూడా మీకు సాయం చేస్తానులెండి.

హను: నేనుమాత్రం ఊరికేకూర్చొని యేమిచెయ్యాలి. పట్టండి నలుగురం నాలుగు కొమ్ములు మోసేదాం. కాని, ప్లీడర్ ప్రాసిక్యూటరుకు దినానికి రు. 85 లు. మేజిస్ట్రేటువారికి యథావిధిగా జీతం ముట్టుతవే. మనకేమీలేదే. అది మాత్రం నాకు కడుపుమంట. శ్రీనివాస రాఘవయ్యంగారు గారూ, మీరుమాత్ర మేమిచేస్తారు? [illegible] పక్కకు. ఈకేసులో కాకపోతే మరొకదానిలో కొట్టువారు మట్టుజెప్పిస్తారు లెండి. ప్లీడర్ ప్రాసిక్యూటరు గొప్పేమిటో, టకటకలాడించేదాము.

పే: పేదవాళ్ళ విషయములో మీ చింత ఉదారమైనబుద్ధి చూపడం, జెంచికి వాడుకూడా గౌరవం. మీ రండ

ముద్దాయీల పక్షాన్ని వాదిస్తారా ?

రాధా: చిత్తం. మాలో మాకా భేద మేమిన్ని లేదు.

మేజి: సరే, కేసు కానివ్వనా ?

పల్లి: చిత్తం. కానివ్వండి

మేజి: రెండో ముద్దాయి. అచ్చమ్మా, విను. నువ్వు నీ భర్తను విడిచిపెట్టి, ఈపనివవాళ్ళతో బయలుదేరి, వాళ్ళకేన్ను యిన్నలేదని ఒకఛార్జి. వాళ్ళ పడవలో బంగారం దొంగిలించినావని రెండో ఛార్జి, ఏమంటావు ?

అచ్చి: నాను నాకి తెయ్యాని యిడిసిపెట్టనేను. నన్ను నాకి తె-య్యా యిడిసిపెట్టనేడు. ఈదొంగ నాయాళ్లు నాకి బద్దాలు సెప్పి, నీకి తెయ్యాని సూపిస్తామని, పడవెక్కించి, తిప్పితిప్పి యీవూరు తీసుకొచ్చినారు.

మేజి: వాళ్లకు నీవు కేవివ్వనలెనా ? అక్కరలేదా ?

అచ్చి: నా నేలివ్వాల ? నా నేమి నన్నడకు తెమ్మన్నానా ?

మేజి: వాళ్ళ బంగారం మాట ?

అచ్చి: అళ్ళ మొవానికి బంగారం కూడాను. దొంగ కూతలు కూస్తున్నారు. అల్లమీది కొత్తాదేమో అని అలాసెప్తారు.

మేజి: మొర్రెడ్డి ! కోటరియ్యా ! అచ్చమ్మ కబద్ధాలుచెప్పి,

లేవదీసుకొని వచ్చినారని మీమీదచార్జి. ఏమంటారు?

మెం రె(): ఆ.. య్యా.. య్యా.. య్యాయ్యో! మా మీదికే తిరిగిందే! ఏమన్నాయ మేమన్నాయం?

కాటయ్య: మాకిదేటో తెలను, దేవరా. మాకేవు, మా బంగారం మాకిప్పించియ్యండి, దేవరా!

మేజి: అయితే, మీరా నేరం చేయలేదంటారు?

కాటయ్య: నేను, దేవరా! నిప్పాచ్చిగా, దేవుని పాచ్చిగా, నేను.

మేజి: సరే, ప్రాసిక్యూషను సాక్షులను పిలవండి. హాజరుగా ఉన్నారా?

ప్లీ: ఈకేసు స్వభావాన్నిబట్టి దీనికి సాక్ష్యం దొరకడం కష్టం. కమ్యూనిస్టులు లోలోపల పనిచేస్తూ ఉంటారు. అనేక వేషాలు వేస్తూఉంటారు. ఈ కిష్టయ్యను, ఈ అచ్చిని చూడండి. ఎంత అమాయకంగా కనబడుతున్నారో! వీరి చరిత్ర చాలా ఉన్నది. ఈ పోలీసు డయిరీలు ఎగ్జిబిట్లుగా దాఖలు చేస్తున్నాను.

మేజి: ఈ డయిరీలవల్ల ఏమి తెలుస్తుంది?

ప్లీ: ఈ కిష్టయ్య, ఈ అచ్చి, కమ్యూనిస్టుల గుంపులోనివారని తెలుస్తుంది. ఈ కేసులోని వివరములు బయలుపడితే, యిండియాలో ఈకమ్యూనిస్టు లెంత జాస్తిగా, ఎంత

నేర్పుగా, ఎంత చాకచక్యముగా పని చేస్తున్నారో బయలుపడుతుంది. పోలీసువారికి తెలిసినంతమట్టుకు ఈ కిష్టయ్య అనేవాని అసలుపేరు కృష్ణమోహన్ బోస్. ఇతడు అయిదేండ్లక్రిందట బాంబుపోటు నేరముక్రింద కన్విక్టయి, డమ్‌డమ్ జెయిలులో ఉన్నాడు. ఒకనాటి రాత్రి అక్కడనుంచి తప్పించుకొని, సచ్చిదానందస్వామి అనే పేర సన్న్యాసిఅయి, ఇతర కమ్యూనిస్టులకు శిష్యుల వేషము వేసి, దేశములో తిరగడ మారంభించినాడు. ఈ సచ్చిదానంద స్వామిమీద కేసుపెట్టగా, క్రింది కోర్టులో కన్విక్షనయిందిగాని, హైకోర్టులో విడిచిపెట్టినారు. అతరువాత ఆస్వామిజాడ మరి కనబడడమే లేదు. తుదకు కిష్టయ్య అనేవేషముతో నేటికి పట్టుబడ్డాడు.

మే.శి: చాలా హాశ్చర్యంగా వుండే యీకథ!

ప.: అచ్చమ్మ అనేపేరుగల యీ రెండోమనిషి కథ ఇంకా హాశ్చర్యమైనది. ఈమెమొదటిపేరు మిస్. సరస్వతీభాయి. ఈమెది బొంబాయిలోని గిర్గాం. ఈమె తండ్రి తిలక్ కాలములో సుప్రసిద్ధ రాజకీయ నాయకుడైన ఫట్నీవీస్. ఈమె భూలాభాత్‌ను పెండ్లాడినది. అతడు గవర్న్మెంటు ఉద్యోగి. ఈమెకు తండ్రిసంప్రదాయము

వచ్చింది. భార్యాభర్తల కిద్దరికీ పడలేదు. ఒకనాడు
ఆయింటినుంచి యీమె లేచి, బొంబాయిలో క్రిమి-
నల్కు, రష్యా చేరుకొన్నది. అక్కడ బోల్షివిజములో
తరిబీయతు పొందినది. ఐరోపా మహాయుద్ధములో
ఇంగ్లాండుచేరి, కమ్యూనిస్టు స్పయిగా మిస్. కెల్లర్ అనే
పేర పనిచేసినది. యుద్ధమయిన తరువాత ఈ దేశంవచ్చి,
భర్తను కలుసుకొని, బోల్షివిజములో చేరవలసినదని
ప్రేరేపించినది. ఆ భూలాబాత్ రాజభక్తితత్పరుడు
గనుక ఒప్పుకోలేదు. అందువేత అతనిని వదిలిపెట్టి,
కిట్టయ్యా అనేపేరుతో తుంగభద్రఒడ్డున గుడిసెవేసుకొని
కాపురముచేస్తూఉన్న వీనిని కలుసుకొని కొన్నాళ్లున్నది.
వీళ్లిద్దరున్ను కలిసి దేశములో అల్లరులు లేవదీయడానికి
కుట్రచేస్తూ ఉండేవారు. ఈ సంగతి పోలీసులకు తెలిసి
భూలాబాతునున్ను, ఫోటాషహబత్ అనే యీకొత్వా-
లునున్ను మారువేషములతో పంపినారు. ఈకిట్టయ్యే
భూలాబాత్. ఈ మొర్రడ్డే ఫోటాషహబత్.

సే. జ: హా! ఈకథ మరీ ఆశ్చర్యంగా ఉంది. అయితే
పాణిఖ్యానువారు అచ్చిమీద వేసిన కేవిన్యకపోవడము,
బంగారం దొంగిలించడము, అనేఛార్జీలను వదలుకొన్నా-
రన్నమాట.

ప్లీ: ఇప్పటికి కోర్టువారు నేరములను గురించి విచారించ నక్కరలేదు. కాని ప్రాసిక్యూషను తప్పిపోతే, ఆ నేరముల క్రింద సాక్షి చేయవచ్చును.

మేజి: మొర్రెడ్డి, కొట్రయ్యలమీద సాక్ష్యములుకూడా వసలు కొన్నట్టే కదా? వాళ్ళని ప్రాసిక్యూషను పక్షమున సాక్షులుగా వేసుకొంటారా?

ప్లీ: చిత్తము. కోర్టువారు వాళ్ళిద్దరిని ముద్దాయిల క్రింద విడిచిపెట్టాలి.

మేజి: సరే, విడిచినాము. (వాళ్ళిద్దరు బోనులోనుంచి బయటికి వస్తారు) మొర్రెడ్డిని సాక్షిబోనులో ఎక్కించండి. (మొర్రెడ్డి సాక్షిబోను ఎక్కుతాడు.) క్లార్కు ప్రమాణం చేయించు, (గుమాస్తా ప్రమాణం చేయిస్తాడు.) కానియ్యండి, ప్లీ.

ప్లీ: మొర్రెడ్డీ, ఇక నువ్వు ముద్దాయివి కావు. తెలిసిందా?

మొర్రె: నాను ముద్దాయిని కానా!

ప్లీ: నీ పేరు ఫస్టాపహాబస్తు.

మొర్రె: మరేం!

గా: కోర్టువారు లీడింగ్ ప్రశ్నల నడగనివ్వకూడదు.

పల్లి: మధ్య మధ్య మీ రడ్డము రాకూడదు.

లగ: అమాట కోర్టువారితో మనవి చెయ్యండి.

పల్లి: (మొర్రిడ్డితో) నువ్వు కొర్టేనిలువి కదా?

హను: ఇదంతా వాని కింటెకన్నవే నేర్పి తీసుకరావలసినది. కోర్టులో నేనా బోధవేయడం!

పల్లి: హనుమంతప్పగా రిన్నేళ్లు పార్ట్సు పెట్టుకొని, ఊరీగా పలుకడం వింతగా ఉంది.—(మొర్రిడ్డితో) నీది బొం-బాయిలోని గ్రామం,

మొర్రి: అదే.

పల్లి: నువ్వీకి త్తయ్య సెక్కుచూచినావు?

మొర్రి: (తనలో) మంచి చిక్కు తెచ్చిపెట్టినాడే! యేమని చెప్పాలో?

పల్లి: ఏమట్లా చూస్తావు! ఉంగరదరి ఒక్కని చూచినావా?

మొర్రి: అవును. మ రేడనూస్తాను!

రాధా: ఈయ సెక్కుచూడమంటే అక్కడే చూడు.

పల్లి: అక్కడ ఈకి త్తయ్య, అచ్చి, అనేకేళ్లు పెట్టుకొన్న పీళ్లేమి చేస్తున్నారు?

మొర్రి: ఏం చేస్తారు? మీకు తెలదా?

పల్లి: నువ్వు వాళ్ళ పాటలు విన్నావా?

మొర్రి: వో! యినకేం? యింటూనే వున్నా.

పల్లి: ఆమాటలన్నీ ఏ డయిరీలో వ్రాసినావుకమా?

మొర్రి: రాసినాను కానూ?

పల్లి: కోర్టువారియెదుట పెట్టిన డయిరీలోని మాటలేనా...

మొర్రి: నువ్వు సెప్పినట్టే.

పల్లి: సరి.

మేజి: క్రాసు కానియ్యండి.

రాధా: ఏ పేరు?

మొర్రి: మొర్రెడ్డి.

రాధా: మరేదో అని చెప్పినావే?

మొర్రి: నా నేమీ సెప్పనేదే!

పల్లి: ఫోటూషహాబత్.

మొర్రి: అవునవు నదే ఆయప్ప సెప్పిండే.

జగ: ఏమి టా పేరు?

మొర్రి: చోడాసత్.

పల్లి: ఫోటాషహాబత్తనడానికి 'చోడాసత్' అనేది సంక్షిప్తమైన పేరు. జగన్నాథరావుకు 'జగ్గు', కృష్ణమూర్తికి 'కిట్టు', నరసింహావికి 'నరుసు', శ్రీనివాసానికి 'సీను' వలె.

హను: మొరార్జీ, ఏది తురకకులమా ?

మొరా: ఏమన్నా అంటే ఒప్పుకొంటానుగాని, నన్ను తురకోడంటే మాత్రము...

శ్రీ. రా. అ: అనాల్, సోడా శరబ్బత్ పెయర్ ఎన్ను ?

మొరా: అడేటంటాడో! కిస బీస గోల.

జగ: ఏ ఊరి పేరు ?

పల్లి: 'గిర్గాం' అని యింతకుముందే చెప్పినాడు.

హను: మిమ్మలి నడుగలేదు. ఫోటాషహాబత్తు నడుగుతున్నాను.

పల్లి: వాని తరఫున మేము చెప్పుతున్నాము.

జగ: అయితే, మీరే బోసెక్కి ఫోటాషహాబత్తు కండి.—ఏం, మొరార్జీ, నువ్వు పొయ్యేసరికి కిత్త య్యెక్కడున్నాడు?

పల్లి: అడిగిన ప్రశ్నలే అడిగి కోర్టువారి కాలమును వృథాచేయ కూడదు.

జగ: నే నాప్రశ్న యింతకుముం దడుగలేదు.

పల్లి: మీ రడుగకపోతే నే నడిగినానా. లేదా ?

జగ: ఏ సెక్షన్ ప్రకారం నే నడుగకూడదో చెప్పండి.

పల్లి: ఎవిడెన్సు ఆక్టు 144 సెక్షను ప్రకారము.

జగ: ఆ సెక్షను వర్తించదు.

పల్లి: ఇకముందు తమవద్ద లా నేర్చుకొంటాను లెండి.

రాధా: నీవు పోయేసరికి కిత్త యెక్కడున్నాడో కోర్టువారికి తెలియజెయ్యి.

మొరళి: ఆవులు మేపుకొంటున్నాడు.

రాధా: ఇందాకా మాట్లాడుతూఉన్నా విన్నావే?

పల్లి: ఆవులు తోలుతే మాట్లాడకూడదా? ఏమిప్రశ్నలయ్యా, ఇవి? చొప్పదంటు ప్రశ్నలు!

రాధా: కొంచెం గౌరవంగా మాట్లాడండి.—అయితే, [illegible]-పాత్రీ, నువ్వు విన్నదంతా అఫిడవిట్లో వ్రాసి నావ్వకదూ!

మొరళి: రాసినానూ!

రాధా: నీకు వ్రాత వచ్చునా?

మొరళి: వో!

రాధా: (మేజిస్ట్రేటుతో) అఫిడవిట్ యిలాదయచేయండి. (పుచ్చుకొని మొరళ్ళితో) ఏదీ, చదువు.

... రి): (చనవలేక దిక్కు లు చూస్తున్నాడు)

పల్లి: వానికి వ్రాతవచ్చునన్నాడుగాని, చదువువచ్చునన్నాడా?

జగ: వ్రాయగలిగినవాడు చదువలేడూ?

పల్లి: వ్రాయగలిగిన వా రందరూ చదువగలిగితే యింకేముంది? ఇంతే మన తెలివితేటలు.

రాధా: చాలాబాగుంది.— ఇక దిగు. (దిగుతున్నాడు.)

మేజ: కొట్టయ్యా, నువ్వెక్కు. (కొట్టయ్య ఎక్కుతున్నాడు.)

పల్లి: ఏ పేరు ధూళాబాత్.

కొటయ్య: మావోళ్ళలాగే యెట్టినారు కాబోల పేరు.

జగ: కానివ్వండి, కానివ్వండి. మీయిష్టం వచ్చినట్లు కానివ్వండి.

పల్లి: నువ్వే అచ్చి అసలు మగడివి.

కొటయ్య: కాకేం?

అచ్చి: ఎవడివిరా, నువ్వు, నిన్నోరొడిపోను?

కత: ఏడీ? మళ్ళీఆను ఆయాట? ఏప సేమవుతాదో!

పల్లి: కోస్టువారు ముద్దాయిగాల మాటలను చేష్టలను గమనించవలెను.

మేజి: చూస్తున్నాము.

పల్లి: ఇది నిన్ను విడిచి పోయింది కదూ?

కాట్రి: మరేటి?

అచ్చి: ఛా, నోరుముయ్!

కీర్తి: నీకు ప్రాణాలమీద ఆశలేదా?

పల్లి: గోర్టువారే సాక్షిని రక్షించవలెను. నీళ్లెంతటికయినా తెగిస్తారు.

మేజి: ఏమీభయములేదు. సర్కారువారి దీర్ఘహస్తము సకల ప్రజలకున్ను అభయ మిస్తున్నది.

పల్లి: సర్కారుశక్తి ఘనమైన గోర్టువారిలో ఆవేశించి ఉన్నంత కాలమున్ను....

రాధా: మీ ముఖప్రీతిమాట లింక చాలించండి.

పల్లి: ఏమండీ, మీకుకూడా ముద్దాయీలలో చేరవలెననిఉందా యేమిటి?

హాను: మీ బెదరింపు లింక కట్టిపెట్టండి. ఘనమైన గోర్టువారు న్యాయమూర్తులు. వారు మాకున్ను న్యాయమునే అనుగ్రహిస్తారు.

పల్లి: నా ఛీఫ్ సరి.

మేజ: క్రాస్!

రాధా: ఏ పేరు?

కాట్రి: కా....

పల్లి: ధూ...

రాధా: ఇదుగో, మీరుండండి.

పల్లి: ధూలా...

జగ: ఏమండీ, మళ్లీ తగులు కొన్నారూ?– ఇట్లామాట లం-
దిస్తూ ఉంటే, మేమీ కేసులో పనిచేయలేము.

మేజ: ఏమండీ, పబ్లికుప్రాసిక్యూటరుగారూ, మీ రద్దు చేస్తూ
ఉండకండి. మీకు మే మనుకూలముగా ఉన్నామని
లోకమనుమానించకూడదు.

పల్లి: నేనే మన్నాను?

రాధా: ఏ పేరు?

కాట్రి: నా పేరే నాకు తెలదనుకొన్నావేటి?

రాధా: ఏమిటో చెప్పు.

కాట్రి: బాబ్జిట్.

జగ: బలే, బలే! ఇద్దర కాదూ?

రాధా: అయితే అది నీభార్య అంటావు?

కోట్రి: మరేటనమన్నావు! నీబారియనమంటావా! కాని, అలాగే అనుకో. నన్ను మాత్రం నీకుక్కలోకి దింపక!

రాధా: అది నీభార్య అవునా, కాదా?

కోట్రి: ఈనూ, 'నాబారియ' అంటాడు. ఈయన 'నాబారియ' అనమంటాడు. నువ్వుకూడా 'నాబారియ' అనుకొంటే అనుకో.

అచ్చి: ఎకోత్రిడి పెళ్లాం వాడవాడినంట. ఏమర్రా, మీకవళ్లకి బుద్ధులున్నాయా, నేదా?

రాధా: మా క్రాస్ సరి.

మేజి: ఆర్గ్యుమెంట్లు కానివ్వండి.

ప్లీ: నేను దీర్ఘముగా ఆర్గ్యుమెంటు చేయనక్కరలేదు. ఈ-కిష్టయ్య, అచ్చి, అనేవాళ్లు కమ్యూనిస్టులు. వీళ్ళకు తగిన శిక్ష వేయకపోతే ఈలోకమంతా తల్లకిందయి-పోతుంది. కాబట్టి, ఇట్టికేసులు కోర్టులలో జరుగకుండా ఉండేటట్లు పెద్ద శిక్ష విధించవలెనని ఘనమైనకోర్టువారిని ప్రార్థిస్తున్నాను.

మేజి: రాధాకాహన్ గారూ, మీరు కానివ్వండి.

రాధా: ఈదేశములో కమ్యూనాలిజమేగాని. కమ్యూనిజము లేదు. బహుదూరిజమే కాని భోల్షివిజము లేదు, నామినాలిజమే కాని నేషనాలిజమసలే లేదు, షోకిల్లాయిజమే కాని సోషలిజమే లేదు. ఈవిషయమై నేను ప్రమాణముచేసి చెప్ప గలను. నన్ను చూడండి. నేను కార్యదర్శిగానో, అధ్యక్షుడుగానో, కార్యనిర్వాహక సభ్యుడుగానో లేని సంస్థలేదు. నేను కలుగజేసుకోని ఉద్యమమే లేదు. నా అనుభవమును బట్టి మనవి చేస్తున్నాను. అవన్ని సురక్షితముగా లేవని ఎవరు చెప్పగలరో చెప్పమనండి.

ప్ర: అవి ముందుకు నడుస్తే కదా? తమప్రభావమటువంటిది!

రాధా: అవునామరి? అదే నేనంటున్నది. చూచినారా, ప్రాసి-క్యూషనువారుకూడా నాతో ఏకీభవిస్తున్నారు. వారికి నేను కృతజ్ఞుడను....ప్రస్తుతపు కేసులో ఈ కిష్టయ్య. అచ్చి, అనే ఈముద్దాయీలు కేవలము అమాయకులు. వాళ్ళ మొగాలు చూస్తేనే అది తెలుస్తుంది. ఈ-మోఃరెడ్డి, కోటయ్య, అనేపడవవాళ్ళు అచ్చిని మోసము చేసి తీసుక వచ్చినారు.

ప్ర: అయితే, పోలీసువారు తప్పడుకేసు పెట్టినారంటారా?

జగ: మావాద మదికాదు. పోలీసువారు తమ ధర్మమును శ్లాఘాపాత్రముగానే నిర్వర్తించుకొన్నారు.

హాను: పోలీసువారు పొరపాటుపడ్డారని మాత్రము మావాదము.

శ్రీ. రా. అ: అవు!

రాధా: నేను మాత్రము ప్రాసిక్యూషనువారి ఊహ కవకాశము లేదంటానా? కాని....

మేజి: సరే లెండి. ఇక చాలు.

రాధా: ఘనమైన కోర్టువారు...

మేజి: ఇక కూర్చోండీ!

రాధా: మహాఘనమైన కోర్టువారు...

మేజి: ఏమండీ, చెప్పితే వినబడదూ, సిట్ డౌన్ ప్లీజ్.

రాధా: చిత్తం, చిత్తం. (కూర్చుంటున్నాడు.)

మేజి: ఇదుగో తీర్పు చెప్పుతున్నాను—

ఈకేసు చిన్నదంటే చిన్నదనుకోవచ్చును: పెద్దదంటే పెద్దదే అనుకోవచ్చును. ముద్దాయీలను విడిచిపెట్టడానికి కారణములున్నవి; శిక్ష విధించడానికి కూడా కారణములున్నవి. వీళ్లు అమాయకులనడానికి అవకాశముున్నది. క్రూరమనుష్యులనడానికిన్ని అవకాశమున్నది. ఇట్టి సందిగ్ధవిషయములో ఏమి చేయవలెనో క్రిమినల్ ప్రొసీజరు కోడులో సూచనలేదు.

రాఘా: బెనిఫిట్ ఆఫ్ ది డౌటు అక్యూజుడుకు ఇవ్వవలెనని ఉంది.

పబ్లి: లేదు, ఎంత మాత్రమున్ను లేదు. అట్లాచేస్తే సంఘానికి దేశానికికూడా గొప్ప ఉపద్రవము జరుగుతుంది.

మేజి: మేమీ రెండు విషయాలను గమనించినాము. అందుచేత మేము చెప్పే తీర్పేమంటే, "కిత్తయ్యను, అచ్చిని విడిచి పెట్టారున్నాము."

కిత్త: అవీ, అవీ, అట్లా ఉండాల. ధర్మప్రభువులు—రారయ్, అచ్చీ, పోదాము.

అచ్చి: నాకిత్తయ్యా, నాకు మళ్ళీ చిక్కినావా? (కౌగిలించుకొంటున్నది.)

మేజి: ఎయ్, కోర్టులో అటువంటిపనులు చేయకూడదు. నా-తీర్పు పూర్తిగా వినండి—"కిత్తయ్యని, అచ్చిని కుంగనూర్ ఒడ్డున వాళ్ళగుడిసెలోనే ఇంటర్న్ చేస్తున్నాము....

కిత్త: అంటే?

మేజి: అంటే మీరాస్థలములోనే ఉండవలెను. విడిచిరాకూడదు.—వస్తే, మిమ్మల్ని పోలీసువారు ఎరెస్టుచేస్తారు.

అచ్చి: ఒకసారి అనుభవమయింది. యింకా రావడమే! ఈ శిక్ష మాబాగుంది కిత్తయ్య యెల్లకాలం నాకాడనే వుంటాడు. రా, మామా, పోదాము.

మేజి: ఉండండి. ఇంకా తీర్పు కాలేదు. వీళ్ళిద్దరూ ఈమధ్య తోవలో ఎక్కడయినా దాటిపోతారేమో, అంచేత, కాట్రియ్యా, మొర్రెడ్డి, తమపడవలో వాళ్ళగుడిసెకు దిగబెట్టవలెను.

కాట్రి: మాకేంపట్టింది? అల్లాగే పొమ్మనండి.

మేజి: హాయ్, మాట్లాడకూడదు. వాళ్లను దిగబెట్టినట్టు మాతో వచ్చి చెప్పాలి. ఓయ్, పోలీసు, వీళ్లుదిగబెడతారో లేదో, నువ్వుకూడా వీళ్లతో పోయి, తిరిగి వీళ్లని కోర్టులో హాజరు పెట్టు. నీకు ప్రయాణం బత్తా యిప్పిస్తాములే.

పోలీ. చిత్తం.

గుమాస్తా: ఈదినానికి కోర్టు బర్తరఫ్!

(అందరూ పోతున్నారు.)

(కిత్తయ్య. అచ్చి పాడుతారు)

ఇద్దరున్నూ: పోలో - పోలో - పొంగాలి - పోలో
పొంగాలి - లోకాలు - బింగార - మాతోను - పోలో.

కిష్టయ్య: రాసుగా - 80ట్లోను - రాణులే - వుంటేను
రంగైన - నాయచ్చి - నారాణి - అవుతాది - పోలో.

అచ్చి: రాచహా - తుక్కేకి - రాచకొడు - కులుంటె
రంగుకే - ప్రదునాకు - రాచకొడు - కవుతాను - పోలో



